ప్రకాశకులు:—
శ్రీ ఎర్నేని లక్ష్మీనారాయణ చౌదరిగారు.

# స్వగతము-

## (ఆత్మపరీక్ష)

గ్రంథకర్త:
శ్రీహరి భావోపాధ్యాయుఁడు.

అనువాదకుఁడు:
ఎర్నేని సుబ్రహ్మణ్యము.

మొదటికూర్పు, 1000.



 [వెల రు. 0—4—0.

బెజవాడ

శ్రీ బాల సరస్వతీ ముద్రాక్షరశాల యందు
ముద్రింపఁబడియె.

# అంకితము.



పూజ్య బాపుజీ చరణ కమలము
లకు — భక్తి పూర్వకముగ — హరిజన
సేవార్థము — అరుగు దెంచి నపుడు
అంగలూరు గ్రా — ౧౨-౯-33



# 1 ప్రార్థన

స్వగత మనగా ఆత్మ పరీక్ష-ఆత్మ శోధన. ఆత్మ పరీక్ష ఆత్మ నిరీక్షణమునకు మూలము. సత్యారాధన తత్పరులకు అత్యంత ప్రయోజన కారి. ఇందులో సందేహము లేదు.

ఆత్మ శుద్ధికై ప్రయత్నించు ఈ యుగములో ఆత్మ స్వాతంత్ర్యమును కోరు ఈ యుగములో ఆత్మ జ్ఞానము కలుగుటకై, ఆత్మ విశ్వాసము పెంపొందుటకై, సత్యానురక్తి, బలపడుటకై, ఆత్మ వితరణ శక్తి మేలుకొనుటకై సాధకున కిట్టి ఆత్మ పరీక్ష అనివార్యమని స్వగతము చాటుచున్నది. ఇది ఎంత వరకు సత్యమో సత్యవ్రత పరాయణులగు సాధకులు సాధించి జూతురు గాక!

ఇట్టి ఆత్మశిక్షయే జైలుశిక్ష! జైలుశిక్ష అనఁగా ఆత్మ పరీక్ష! ఈ స్వగతమే దీనికి ప్రబల సాక్షి.

గ్రంథకర్త శ్రీ హరి భావోపాధ్యాయుఁడు. మహాత్ముని ప్రియ భక్తుఁడు. ఆయన స్వానుభవమే ఈ స్వగతము. జైలు జీవనము సత్య జీవనమునకు, ధర్మ జీవనమునకును, ఎట్లు దారి జూపించునో ఇందు మూల

మున వ్యక్తమగు చున్నది. గత జైలు జీవితానుభవము వలన నా నమ్మిక మఱింత బలపడినది. అందు వలన స్వగతము యొక్క విలువ నా దృష్టిలో అధిక మాయెను. జైలులో మిత్రుల ప్రేరణ వలన, సహాయము వలన హిందీ నుండి ఈ గ్రంథమును తెనుగించి తోటి సోదరుల చేతులలో పెట్టుట నా స్వధర్మముగ తోచినది. నే నిట్లు సాహసించి నందులకు మన్నింపుడు. ఈ గ్రంథ రచనకు తోడ్పడిన మిత్రులకు నా వందనములు. ఆత్మబంధువులును, ప్రకాశకులు నగు శ్రీయుత ఎర్నేని లక్ష్మీనారాయణ చౌదరిగారికి నా హృదయ పూర్వక వందనములు. అచ్చొత్తించి సహాయము చేసిన ప్రియ సోదరుడు తిపిర్నేని వీరరాఘవయ్య చౌదరిగారికి నా వందనములు! సోదరులారా? నా తప్పులు మన్నించి ఒప్పులే గ్రహింతురుగాక! ఇది నా ప్రార్థన!

శ్లో॥ "అసతో మా సద్గమయ తమసో మా
జ్యోతిర్గమయ మృత్యోర్మా మృతంగమయ"

అంగలూరు, } ఇట్లు,
౪-౧౧-33. } అనువాదకుడు.

# కొన్ని మాటలు



'సస్తా సాహిత్య మండలి' నా 'స్వాగతము' లను గ్రంథ రూపమున ప్రకటించు చున్నది. ఈ స్వాగతములే అప్పు డప్పుడు 'మాలవ మయూరము' లేక 'త్యాగ భూమి' యను మాస పత్రికలో వెలువడు చుండెడివి. వీని ద్వారా పాఠకులకు మంచి సేవ చేయ వచ్చు నను భావము నా కప్పు డుండెను. స్వాగతములు మనో విచారములు - మనో తరంగములు. విచార శీలుఁడయిన వాఁడు ఎవఁడైనను, మంచి మంచి - అమోఘము లయిన విచార ములను - భావములను పాఠకుల కొసంగ గలఁడు. కాని ఆ భావములతో పాటు జీవి తములో అనుష్టాన బల మున్నపుడే వాని విలువ అధిక మవును. అప్పుడే ఆభావముల యొక్క స్థిరమయిన ప్రభావము పాఠకుల చిత్తములపై పడగలదు. గత పది మాసముల జైలు జీవి తములో నాకు మిక్కిలి లోతుగా ఆత్మ విచా రణ చేయుటకు మంచి అవకాశము చిక్కినది. నిరంతరము నేను కార్య నిమగ్నుఁడనై యుం

డుట చేత బయట నా కట్టి అవకాశము లభింప దాయె. నేను నా సూక్ష్మ మనో ప్రవృత్తులను పరీక్షించుటకై, వానిపై ధ్యాన ముంచుటకై చాల ప్రయత్నించి యున్నాఁడను. నా విచారములను, నా యాచారములను తూచి సరిజూచి యున్నాఁడను. నా యాదర్శములను నా దుర్బలత్వమును గూర్చి విచారణ సల్పి యున్నాఁడను. అందు వలన తుదకు నన్ను నేను ఒట్టి గుల్లగా నెఱింగి యున్నాఁడను. అట్టి స్థితిలో స్వాగతము యొక్క విలువ నా దృష్టిలో స్వల్ప మగుట సహజమే. అయినప్పటికిని స్వాగతము వలన పాఠకుల కెట్టి లాభము కలిగిన అది వారి సజ్జనత్వమునకే గుణగ్రాహకత్వమునకే ప్రమాణ మగును.

గాంధీ ఆశ్రమము<br>
హటూండీ<br>
చైత్ర శుక్ల ౫సం. ౧౯౭౭

ఇట్లు<br>
హరిభావూపాధ్యాయుఁడు.

ఓం శ్రీసాయిరామ్

# స్వాగతము

నేనెప్పుడు నా గుణములను పరుల దోషములను జూచుచున్నానో అప్పుడు నేనొక మహాత్ముఁడను గాకపోయినను తప్పక సాధుపురుషుండనయి యుండునని స్ఫురించుచున్నది. కాని నేనెప్పుడు నా దోషములను పరులగుణములను జూచుచున్నానో అప్పుడు నా హృదయమిట్లు చెప్పుచున్నది:—

"నావంటి కుటిలుఁడు, ఖలుఁడు, కామి ఎవఁడు?" (సూరదాసు)

* * *

యోగ్యత దాగియుండదు. యోగ్యుఁడు గౌరవింపఁబడకుండ నుండఁజాలఁడు. పుష్పము వికసించిన ప్రజలు ఆకర్షింపఁబడుదురు. పరిమళము వ్యాపించుచున్న కొలఁది జనులు వెదకికొనుచు నచటికే చేరుదురు.

* * *

స్వగతము.

కాని ఎన్నియో పుష్పములు వనములో వికసించి వాడిపోవుచున్నవి. మానవుఁడు వాని జాడ గుర్తించుటలేదు. యోగ్యుఁడగుట ఒకవిష యము - యోగ్యతా పరిచయము చేయుట మఱియొక విషయము. యోగ్యతా పరిచ యము కలిగించుట ఒక విషయము. అయోగ్య తనే యోగ్యతగా నెఱుంగుట, మఱి దానినే డప్పువేసి చాటుట మఱొక విషయము.

* * *

నాగుమ్ముకడ రెండు తుమ్మ మొక్కలు పెరుగుచున్నవి. మిత్రులు నీవు ద్వారముకడ ఈ ముండ్లచెట్ల నేల పెంచుచున్నావని యడుగు చున్నారు. నేను నవ్వుచు చెప్పునదేమన - అది ఆశ్రమముయొక్క ఆదర్శము. నాసహనశీలతకు నిదర్శనము.

* * *

నేను స్వార్థిని. ఏలయన, నేను గుణ గ్రాహ కుఁడను. నేను ఇతరుల గుణములఁజూచి గ్రహిం పఁబ్రయత్నించు చున్నాను.

* * *

నాపొరుగు వాఁడు పరమార్థి. ఏలయన; వాఁడు విమర్శకుఁడు. వాఁడు పరుల దోషములను చూపించుచున్నాఁడు. వాఁడు వారి దోషములను దూరము గావించుకొనుట కవకాశ మిచ్చుచున్నాఁడు.

*　　　*　　　*

ఇతరులయందు ఏ దుర్గుణములు లేక ఏ సద్గుణములు మనకు కానిపించుచున్నవో అవి మన హృదయములోని మంచి చెడుగుల భావ ప్రతిబింబములే! మనయందు చెడ్డతనము అధికమున్నచో ఎదుటివాని తప్పిదములు ముందే అధికముగా కన్పట్టును. మఱి మంచితన మధికమున్నచో ఒప్పిదములే కానిపించును.

*　　　*　　　*

ఆలోచనకర్త వేరు. సంస్కర్త వేరు. ఆలోచనకర్త తన ప్రభావము నితరుల మీఁద పడునట్లు వాంఛించును. సంస్కర్త ప్రేమతో, మృదుత్వముతో, (ఉపాయముతో) మందలింపుతో పని సాధించును.

*　　　*　　　*

స్వగతము.

ఏ మనుష్యుఁడు కేవలము దోషముల నెంచు చుండునో వాఁడు నీచుఁడు. ఎవఁడు గుణదోష ములు రెండిటిని వెదకుచుండునో వాఁడు మధ్య ముఁడు. ఎవఁడు కేవలము గుణములందే ధ్యాన ముంచుచున్నాఁడో వాఁ డుత్తముఁడు.

* * *

ఎవఁడు కేవలము గుణాన్వేషణమందే యుం డునో, ఏదయినను దోషము కాన్పించినను ఎవఁడు దానిని ప్రపంచమందు వ్యాపింపఁజేయక సావధానముగ దానిని దూరముగావింప యత్నిం చుచున్నాఁడో, వాఁడే, ఆమనుష్యుఁడే జయము పొందు నాయకుఁడు కాఁగలఁడు.

* * *

ఎవఁడు తప్పులెంచుచున్నాఁడో వాఁడు లోక మున కిల్లు చాటుకొను చున్నాడన్న మాట. వాయందు దోషముల నెంచు శక్తియే యున్నది. నాకు దోషము లెంచుటే సంతోషము-సహజ ముగ నాహృదయము దోషములతో నిండి యున్నది. ఇదే విధముగ గుణగ్రాహకుని గురించి కూడ వర్తించును.

* * *

పాడుచేయ ప్రయత్నించుట సంస్కరించుటకు చేయు ప్రయత్నము కాదు. సంస్కర్త యన్ననో ఉద్ధరింపఁ గోరును.

*     *     *

తప్పుచేయుట మానవునకు స్వాభావికము కావచ్చును. కాని తప్పును సమర్థించుట సైతాను పని--రాక్షస కృత్యము.

*     *     *

విద్యాభిమానము, ధనాభిమానము, రెండును సమానములే.— కావు. కాని విద్యలేక విద్వాంసుని అభిమానము మిక్కిలి అస్వాభావికము గనుకనే దూష్యమై యున్నది. విద్యకు, యోగ్యతకు, జ్ఞానమునకు ఫలము వినయమే. అభిమానమో అవిద్యయొక్క సంతానము.

*     *     *

విద్వాన్ లేక యోగ్యతాబిరుదములనుంచుకొను దురభిమాని, ధనాభిమాని నెట్లు సఫలతాపూర్వకముగ దూషించును? ఎట్లు సంస్కరింపగల్గును?

*     *     *

స్వగతము.

నన్ను నేను సమిష్టి వాదిగా చెప్పుకొను చున్నాను. ధనము, ఐశ్వర్యము, అధికారము అనుభవించు వారలను నేను దోషులుగ పరిగ ణించు చున్నాను. కాని ఆశ్చర్య మేమన ఆధనము, ఆ ఐశ్వర్యము, ఆయధికారములభించి నచో నేను కూడ నట్టే చేయ సాగుదును గద!

* * *

నేను సమాజ హితము కొఱకై సమిష్టి వాది నయితినా? లేక నా హితము కొఱకా?

* * *

తామే తెలివిగలవారమని ప్రపంచ వ్యవ హారమందు కుశలుల మని తలంచు కొందరు మిత్రులు ఇట్లు చెప్పుచుందురు— సేవకూడ వర్తక సరళిగ ప్రాపంచక దృష్టితో చేయవల యును.

* * *

కాని నేను తెలిసికొన్నంతవరకు రాముడు, కృష్ణుడు, బుద్ధుడు, మహావీరుడు, శంకరుడు నానకు, దయానంద, తిలకు, గోఖలె, గాంధి, ఏసు

క్రీస్తు, మున్నగువారు వ్యాపార సరళిని గాని ప్రాపంచిక రీతిని గాని వారు నేర్చుకొని యుండలేదు.

* * *

ఎవఁడు నిరంతర మితరులయందున్న చెడుగునే చూచుచున్నాఁడో వాఁడున్నతాదర్శమును పొందలేఁడు. వానిజీవితములో ఘనకార్యములు చేయు భాగ్యము లేదు!

వివేకమిట్లు బోధించుచున్నది—

చూడుము! మీరు మంచివారే కానిండు. కాని ప్రపంచము మిమ్ము మోసపుచ్చును. నేను చెప్పున దేమన, ఇందువలన నా కేమి చెడును? ప్రపంచమే దుఃఖ మనుభవించును. తప్పు చేయునది ప్రపంచమా? నేనా?

* * *

ప్రపంచములో చెడుగు, మోసము, ఉన్న వని నేను సత్కార్యాభివృద్ధికి అడ్డపడుదునా? ఎలుకలు తినునని ధాన్యము నిల్వబోయక

స్వగతము.

మానుదునా? వడగండ్లు పడునను భయముచే వ్యవసాయకుఁడు కృషి చేయక మానునా?

ఎవరైనను నన్ను నిందించినప్పుడు నేనీరెండు విషయముల నాలోచించు చుందును. ఆ నింద సత్యమా? లేక అసత్యమా? సత్యమైనచో సర్వదా నేనా నిందకు పాత్రుఁడనే. ఆ నిందకునకు ధన్యవాదములే యర్పించవలెను. ఏలన నారోగము వైపునకు నాదృష్టిని మరల్చును గనుక. అది యసత్యమే యయినచో దోషము వానిదే. నాది కాదు. కాబట్టి శిక్ష వానికే లభింపవలయును. నేను కుపితుఁడనై అతని యపరాధమునకు శిక్షగా క్రోధమనే శిక్షను నే నేల స్వయముగా పొందవలెను?

*　　*　　*

ఒకమిత్రుఁడు మఱొకమిత్రుని ప్రశంసించెను. అప్పుడామిత్రుఁ డిట్లు చెప్పెను—ఇది పొగడ్తకు యుగము కాదు. కార్యాచరణమునకే యుగము.

*　　*　　*

కొందఱు మిత్రులిట్లనుచున్నారు. పత్రికా సంపాదకు లందరు సహజముగా 'మేము' అని వ్రాసికొను చున్నారు. మీరు 'నేను' అని వ్రాసికొనుచున్నా రేమి? నేను చెప్పునదేమన. వారు పెద్దలు గనుక, నేను సామాన్య మానవుడనని తలంచుచున్నాను గనుక. వారు తమ్ము ప్రతినిధులమని భావించుకొను చున్నారు. నేనో సామాన్య సేవకుడను. లోకాచారము కూడ తెలుపున దేమన గొప్పవారు తమ్ము 'మేము' అనుకొనుట, చిన్నవారు, 'నేను' అనుకొనుట సహజము.

* * *

అప్పుడప్పుడు కొందఱు మిత్రులిట్లు చెప్పుచున్నారు — మీ మృదుత్వముచే నప్పుడప్పుడు మోసము కలుగును. దీనికంటె తీక్ష్ణమైన పరుషవాక్యములు మిక్కిలి మంచివగును. నేనిట్లు చెప్పుచున్నాను — అట్లయినచో దోషము నాదే కాని, మృదుత్వమునది కాదు. మాట తీక్ష్ణము కానిమ్ము, ప్రియము కానిమ్ము. చెఱుపేమి?

* * *

స్వగతము.

ఈ రోజులలో నాయకులను దూషించు తెగులు వ్యాపించి యున్నది అప్పుడప్పుడు మనస్సులో నాకీ శంక కలుగుచుండును — నాయకులను దూషించువారి మనస్సులలో నాయకత్వము వహించవలె నను రోగము దాగియుండ లేదుగదా?

*　　*　　*

నాయకుడు కావలెనను ఇచ్ఛ చెడ్డది కాదు. కాని కేవలము పరులను దూషించియే నాయకత్వము వహించిన వారి యుదాహరణము చరిత్రలో దొరకుట కడుదుర్లభము.

*　　*　　*

తనకు తానే గొప్పగా తలచుటవలన కేవలము హాని తనకే కాదు. కేవలము తన యభివృద్ధికే, యాటంకము కాదు. ఇతరులకు కూడ అన్యాయము కలుగుచున్నది.— వారిని మనము అల్ప దృష్టితో చూడ సాగుదుము.

*　　*　　*

అహంకారము అనేకసార్లు ఆత్మగౌరవము రూపముతో వచ్చి మనలను మోసపుచ్చు

చున్నది. దేనిని గురించి మనకు చింతింప వలసిన యవసరము లేదో, అదియే ఆత్మగౌర వము.

* * *

ఒక మిత్రుడు చెప్పెను.— త్యాగభూమిని (పత్రిక) మీరు ప్రకటించుట మంచిదే. కాని యీ ప్రతికక్షగల యుగములో నదెట్లు నిలువ గలుగును? నే నిట్లు సమాధాన మిచ్చితిని-- నా యెదుట ప్రతిస్పర్థయను ప్రశ్నయే లేదు. నా దృష్టిలో నున్నది మాత్రము ఒకటే విష యము— త్యాగభూమిద్వారా దేశసేవ మిక్కిలి అధికముగ చేయుటెట్లు పొసగును? ఏ దినమున దానినుండి సేవాభావము తొలగిపో వునో ఆ దినముననే, ప్రతిస్పర్థ లేకున్నను, అది నిలువజాలదు.

* * *

ఒక సజ్జనుడిట్లు వ్రాయుచున్నాడు— తమరు త్యాగోపదేశమును చేయుచున్నారు. స్వయముగానే 'త్యాగముచేసి' త్యాగభూమి'ని ఉచితముగనే నాకు దయచేసి పంపుడు పత్రిక

స్వాగతము.

సంఘసేవా ప్రారంభము ఇష్టి గుణవృత్తే యయినచో మనుష్య త్యాగగుణము, ఈ ఒరపిడి రాతిపై పరీక్షింప సాగినచో 'త్యాగభూమి' బహుశా, తన జీవితమునే త్యాగము చేయవలసి వచ్చును. సంస్థలు ధనము మీదనే నడచుటలేదు. స్వార్థ రహితసేవ, అవిచలప్రేమ, అఖండమైన శ్రద్ధవల్లనే నడచుచున్నవి.

*   *   *

పనిచేయువారు, 'పనిలేదు, ఎవరు పని చూపించుటలేద'ని మొఱ పెట్టుచున్నారు. కార్యనిర్వాహకులు, పనిచేయువారు లేరని మొఱపెట్టుచున్నారు. ఎవరి దుఃఖము సత్యమో చెప్పుము?

*   *   *

కార్యకర్తలు; సేవా పరాయణులు; ఏవారికి అనుగుణమగు పని సిద్ధముగనే యుండును. వారు ఆడంబరమైన సేవావినోదమునే తీసుకొనగోరుచో ప్రళయ కాల పర్యంతము వారి మొఱకు తగినట్టి పనిదేదియు దొరకనేరదు.

*   *   *

కార్య నిర్వాహకులు ఎవరు కఠిన పరీక్షలలో నూటికి నూరుపాళ్లు నిల్వగలుగుదురో వారినే సేవాయోగ్యులుగా తలంతురు. కాని అనుభవములేని అమాయకులగతి యేమి? వీరు సహృదయుల సహాయమున్నచో ముందునకు నడచి సమర్థులు కావచ్చును. కాని అట్టి సహాయము లేనిస్థితిలో సేవాభిలాషుల జీవితము దాస్యజీవితము కాగలదా? పాపము ఇట్టి వారలకు సేవాద్వారము మూయబడియుండుటయే యుచితమా?

* * *

స్వార్థభావము, న్యాయభావము, సేవాభావము ఇవి మానవ వికాసమునకు ఉత్తరోత్తర సోపానములై యున్నవి. స్వార్థభావమందు ఇతరుల హితాహితములు అప్రధానములై యుండును. న్యాయ భావమునందు తన యొక్కయు, ఇతరుల యొక్కయు హితాహితములు సమానముగా నుండును. సేవాభావమందు పరుల హితమే ప్రధానముగ నుండును. స్వార్థపరుడు నిర్దయుడు. న్యాయభావము కల

స్వగతము.

వాడు కఠినుడు. సేవార్థి సదయ హృదయుడు.

*　　　*　　　*

స్వసుఖమునకు సంబంధించినట్టి శ్రేష్ఠ, కనిష్ఠములైన రెండు వస్తువులనుండి, ఏదేని ఒకే వస్తువును, ఎన్నుకొనవలసి వచ్చినచో, కనిష్ఠ వస్తువునే స్వీకరింపుము. మిఠాయి, రొట్టెలలో రొట్టెయున్ను, పప్పు, చాపలలో చాపయున్ను, ఏనుగు, ఎడ్లబండి ప్రయాణములలో ఎడ్లబండి యున్ను, పాలు, మజ్జిగలలో మజ్జిగయున్ను, దేశ సేవకుడు స్వీకరించు చున్నాడు.

*　　　*　　　*

కాని కర్తవ్యపాలనము చేయు అవసరము కలిగినప్పుడు కఠినమైన లేక సులభమైన కార్యములలో ఏదయిన నొకే దాని నెన్నుకొనవలసిన మొదల సంపూర్ణ కఠినమైన కష్టప్రద మయిన కార్యమునే స్వీకరించుచుగాక!

*　　　*　　　*

ఎవనికి వేళకు తిండి తినవలెనని బుద్ధి యుండునో, ఎవడెన్నడు జబ్బుపడడో, ఎవని తూకము తగ్గకుండునో, ఎవనికి పాలు, పండ్లు

తినుటకై ధనము లభించు చుండునో, ఎవడు పరిశుభ్రమైన దుస్తులను సొంపుగా సింగారించుకొనుచున్నాడో, ఎవనికి హాస్యవినోదములకు సమయము లభించుచున్నదో, వాడెట్టి దేశభక్తుడు? ఎవనికి రాత్రింబగళ్లు దేశమును గూర్చి సత్యమయిన చింతయుండునో అట్టి వానికి విషయము లన్నిటికొఱకై ఎట్లు బుద్ధి పోగలదు?

* * *

సేవకునకు పొట్టనుగూర్చి చింతయే కలుగరాదు. ఎవడు పొట్టకై చింతించుచున్నాడో, వాడు సేవ సలుపలేడు.

* * *

కష్టమువలన భయపడుట, గొప్పకార్యము చేయ నభిలషించుట, లోకనిందకు వెఱచుట, మఱి సంస్కర్తయగుటకై వాంఛించుట ఎట్లుండుననగా పుణ్యకార్యముల ననుష్ఠింపకయే స్వర్గము పొంద నాకాంక్షించుచుండు నట్లుగా నుండును.

* * *

స్వగతము.

సత్కార్యముయొక్క గౌరవమువలన ఏ యానందము, సంతోషము లభించుచున్నదో, అట్టి సంతోషమే, ఆనందమే, విఘ్నముల నెదుర్కొని, వాటితో పోరాడుటకు ఉత్సాహము నొసంగుచున్నది.

* * *

ఎంతవరకు మనుష్యుడు నన్ను గురించి, ఎవరు ఏమి తెలిసికొనెను? 'నేను కూడ కొంత శక్తి కలిగియున్నాను. నేనది చేసి చూపించెదను.' అని చెప్పుచున్నాడో అంతవరకును వానియందు ప్రబలమైన మనో దౌర్బల్యమున్నదని గ్రహింపవలయును. ఎప్పుడు మనుష్యుడు, సోదరా! నేనెంత?— ఆదయామయుని, ఆసర్వశక్తి సంపన్నుని హస్తమందు నేనొక కీలుబొమ్మ మాత్రమే యయియున్నాను. ఆయన దయ, శక్తి ప్రపంచమందెట్టి చమత్కారమును చూపింప జాలదు? అని చెప్ప నారంభించునో, అప్పుడే వానియందు ఆత్మ విచారము, జ్ఞానముయొక్క సత్తా బలపడుచున్నదని గమనింపవలెను.

* * *

క్షణికావేశము, అధైర్యము, నిరాశ, ఆత్మ విశ్వాసముయొక్క న్యూనత ఇవి నాస్తికత్వముయొక్క లక్షణములు.

* * *

ఎంత వరకు మనము బాహ్య పరిస్థితులచే ఉత్సాహితులమై, లేక, నిరుత్సాహితులమై, యుందుమో అంత వరకు మనము మనలను ఈశ్వరుని గుర్తించుట లేదనియే యెఱుగవలయును.

* * *

ఎవ డెంత ఆత్మ సంస్కారియగునో, వాని సేవ యందంత బలము కలుగుచున్నది.

* * *

మన మాట ప్రభావము ఎవరి మీదనయిన పడకున్నచో మన (రోషము) క్రోధమునకు పాత్రుడు వాడు కాడు. మన తప్పులే, లోటుపాటులే (దానికి కారణము.) రోషము వచ్చి మనము మన అపరాధమునకై పరులను శిక్షించు చున్నాము.

* * *

స్వగతము.

ప్రలోభకరములగు వస్తువులందే మన కెంత వరకు నానందము కలుగుచుండునో, అంతవర కును అపాయమే. ఎప్పుడు మనము సరస మైన, నీరసమైన రెండు వస్తువులందును సంతోషమును పొంద నారంభింతుమో, అప్పుడే మనము జయించిన వార మగుదుము.

* * *

సఫలతా విఫలతలు రెండును ఊహాతీతమై భిన్నమైన వగుచున్నవి. మనుష్యునియొక్క బుద్ధి, కల్పన, పరిమితములు. కాని కార్యము లందు ప్రభావము గలిగించునట్టి మంచిచెడ్డ శక్తులు అపరిమితములు అజ్ఞాతములై (తెలియ బడనివై) యున్నవి.

* * *

ప్రపంచమందు తా ననుకొన్న ప్రకారము సఫలతకలుగగా చూచినట్టిమనుష్యుడొక్కడు కూడ జన్మించి యున్నట్లులేదు. కాబట్టి మా నవుని కర్తవ్యము కేవలము శుభహేతువుచే, సత్కర్మ చేయుట మాత్రమే. కాని శుభ పరి ణామము-ఫలము-తప్పక సంభవించుచున్నది.

* * *

దేశభక్తుల దివ్యభవనమేది? బందిఖానా. ఇనుప బేడీలే వారి కంఠమందు పుష్పమాలలు. చితిమే వారి రాజ సింహాసనము. సిలువ వారి రాజ దండముగా నెఱుంగుము. ఇక మృత్యువే వారి అనంతమైన అమరత్వము.

* * *

ఎంత వరకు మనకు సంపూర్ణ స్వాతంత్ర్య మొసంగ బడదో, అంత వరకు మన మనస్సు కార్య నిమగ్నము కాజాలదని కొందఱు మను ష్యులు చెప్పుచుందురు. కాని మనము వారి కార్య మును బట్టి, పరిణామమును బట్టి, వారి స్వా తంత్ర్యార్థము శిథిల మయినదిగా తెలుసుకొను చున్నాము.

* * *

ఎవడు నియమబద్ధతను మన్నింపడో వాడు వాస్తవముగా స్వాతంత్ర్యమును గూడ మన్నిం పడు. ప్రకృతి స్వతంత్ర మయినది. ఏలన అది నియమబద్ధ మయినది.

* * *

స్వాగతము.

ఎవడు పరులమీద విశ్వాసముంచుట లేదో వాడు తనమీద విశ్వాస ముంచుకొనుటలో గూడ అసమర్థుడై యుండవలెను.

*　*　*

హృదయముయొక్క పరివర్తన సామర్థ్యము ఒక్క విశ్వాసమందు మాత్రమే యుండును. అవిశ్వాసమే అపఫలతకు బీజము.

*　*　*

లోకులు తఱచుగా అసత్య నిందారోపణ చేయువారలపై కోపగించుకొందురు. తను మన స్సునకు గూడ మిక్కిలి సంతాపమును గలి గించుకొందురు. నే నిట్లు చెప్పుచున్నాను. అసత్యమయిన నింద కలిగిన లేక విన్న మీదట మనము దుఃఖింపనేల? తప్పు చేయునది నింద కుడు. మనకు మనమే శిక్ష వేసికొనుచున్నాము.

*　*　*

లోకులు సాధారణముగా సత్యము కఠిన మైనదని నుడువుచుందురు. నా దృఢ నిశ్చయ మేమన సత్యము, కఠినత ఒకదానిలో నొకటి కలిసియుండజాలవు.

*　*　*

స్వగతము.

మనుష్యుడు కోపములోగాని, నిరాశలో గాని ధైర్యమును వీడిగాని, నోటినుండి పరుష వచనములు పలుకుచున్నాడు. సత్యారాధకుడు ఈ మూడు దోషముల నుండియు తొలంగి యుండును.

* * *

ఎప్పుడు మనుష్యుడు తన మాటల ప్రభావమే ఇతరులమీద పడుగాక యనియే రాత్రిం బగళ్లు చింతింపసాగునో అప్పుడు వాడు తన ఉచిత స్థితిని మీఱుటలేదా?

* * *

మనుష్యుడింత మాత్ర మేల యోచింపరాదు? 'నా కర్తవ్యమేమి?' నేను దాని నెంత వరకు యథార్థముగా సత్యముగా పాలించుచున్నాను? ఎవడు నికృష్టమైన కర్తవ్య పరాయణుడో, వాని ప్రభావము వాని యనుచరులపై మరియు తదితరులపై నేల పడకుండును?

* * *

అట్లు పడనిచో ఇది తన దోషము కాదా! తప్పక తన కర్తవ్య పరాయణత్వమందు లోపమున్నది. తప్పక తన తపస్సు అపూర్ణము.

* * *

స్వగతము.

ఇక తపస్సనగా నేమి? మనయొక్క విచారణ, ఉచ్చారణ కనుగుణమైన యాచారమే తపస్సు. నే నట్టి క్రియాశూరుడ నైనచో నప్పుడు నేను చెప్పకుండగనే, నా సహచరులు కర్తవ్య పరాయణు లగుటకే ప్రయత్నింతురు.

* * *

వినోదపూర్ణమైన వ్యంగ్యముచే స్నేహపూర్ణమగు నింపచే, మధురాలోచనముచే నా సహచరులు మేలుకొనకున్నచో తమ కర్తవ్యపాలన యథారీతిగ నెఱవేర్పకున్నచో నట్టి వారికి పరుష వచనములు నిరుపయోగములే. పరుష వాక్యములు పలుకుటకంటె, నేను నా ఆత్మ శుద్ధికై, ఆత్మ నిరీక్షణకై ఏల ప్రయత్నింపరాదు?

* * *

ప్రపంచమందే దోషమూ, ఏ చెడుగు ఉన్నదో, అది నా దోషముయొక్క ప్రతిబింబమే. నేను నా బాధ్యతను బాగుగా గుర్తింప వలయును. కాని ప్రపంచ భారము మన నెత్తిపై పెట్టుకొనుట అహంకారము కాదా? ఈశ్వరత్వము నారోపించుకొనుట కాదా?

 * * *

ఈ భావముయొక్క పరిణామముచే నా ఆత్మశుద్ధి వృద్ధియగుచో ఇతరులకు సేవచేయు భావమే దృఢపడుచో ఇదియే ఉత్కృష్టమైన నమ్రత, సత్వము అగును — ఇతరులనుండి సేవను గైకొనవలయునను భావము వృద్ధి యగుచో తాను గొప్పవాడనను భావము తీవ్రమయినచో అది అవశ్యము అహంకార ము, పాషండత్వము.

*  *  *

క్రోధమునకు ఆతురతకు మూలము అహం కారము కాదా? సాధారణముగ, ఎవడేని మన యిచ్ఛను పూర్తిగావింపనప్పుడే క్రోధము కల్గుచున్నది. దీని కితరులు బాధ్యులా? దాని నట్లుతలచుట నా అహంకారము కాదా? ఇక మానవ సంఘమును, ప్రకృతిని వశమందుంచు కొను సత్తా నాకు లభించియున్నదను ఈ విష యము ఆతురతను సూచించుటలేదా?

*  *  *

ఈ సత్తా వాస్తవముగా నెవనికడనుండునో వాడు అధైర్యమును, ఆతురతను పొందడు.

*  *  *

ప్యాగతము.

సత్తా శాసించుటకొఱకు కాదు. కార్యము యొక్క సువ్యవస్థకు, సౌలభ్యముకొఱకే అగుచున్నది. సత్తా ఎక్కడ సువ్యవస్థయందు విఫలమగుచున్నదో, అక్కడ ప్రేమకు జయము తప్పక కలుగును.

* * *

ఎవడు తనవిషయమై కఠోరముగను సహచరుల విషయమై సహృదయుడు నగుచున్నాడో, వాడు సత్తాలేశమే శాసకుడగుచున్నాడు. వాని యాజ్ఞ, ప్రేమ సందేశ మగుచున్నది. సహచరులు ఆజ్ఞకై యుత్సుకులగుచుందురు.

* * *

కాని ఎక్కడ తమ్ము గురించి ఆదరభావము, ప్రత్యేక సౌకర్యములు, విశేషాధికారభావమును, సహచరుల విషయమై కాఠిన్య భావము ఉండునో, అప్పుడు అక్కడ సత్తా యొక్క శాసనముకూడ నిరుపయోగము అగుచున్నది. దానికి లభించు బహుమతి అప్రతిష్ఠ.

* * *

కఠినత్వముతోఁ గూడిన నియమపాలనము కార్య సౌలభ్యమునకును, సువ్యవస్థకును అనివార్యము. ఏ సేవకుడు దీని నుపేక్షించుచున్నాడో వాడు పరుల సుఖమును స్వసుఖమునకై బలిదానము చేయఁగోరుచున్నాఁడు.

* * *

ఎవఁడేని మనస్సును లగ్నము చేసి చేయుటచేతనే కార్యము చక్కఁబడును. నేను కార్యమునుండి విముఖుఁడ నగుచో నేను నా భారమును యితరులపై మోపుట లేదా? నేను నా తప్పునకయి దండన నితరులకు విధించుట లేదా?

* * *

సర్వదా ఇతరుల దోషముల చూచుట, సదా ఇతరులపై నవిశ్వాస ముంచుట మన హృదయ మాలిన్యమునకు లక్షణము. సావధానత, జాగరూకత వేరు. అవిశ్వాసము వేరు.

* * *

మనము మన కార్యపరిణామము చూచుటకంటె, మన హృదయ ప్రవృత్తులనే ఏల చూ

స్వగతము.

చుకొనుచుండరాదు? చివరకు మన భావ మె ట్లుండునో, ఫలము అట్లే యుండును. ఫలమును గురించి మనము లోకులను మోసపుచ్చవచ్చు ను. మన మనోభావములను గురించి మనలను మనము మోసగించుకొనజాలము.

* * *

పవిత్ర హృదయముతో గూడిన, బాహ్యా దర సత్కారములే మనుష్యత్వమునకు భూ షణము. దీనికి విపరీత మయినదే మలినత్వము నకు పాషండత్వమునకు సరియయిన ప్రదర్శ నము.

* * *

కఠోర వ్యవస్థాపకుడు లోకప్రియుడు కూడను అయినచో, వాడు సంపూర్ణ సాధు పురుషుడని తెలిసికొమ్ము.

* * *

ప్రస్తుత కాలమందు "పూజ్య" విశేషణము మిక్కిలి చౌక యగుచున్నది. నేను ఎప్పుడు నా పూజ్యవ్యక్తుల చరిత్రను చూచుచున్నానో అప్పుడు నా పామరత్వమును గూర్చి దుఃఖము కలుగుచున్నది. మరియు, ఈ విశేషణము

నుపయోగించువారు వారి ప్రేమ పురస్కారముతో గాక నా పామరత్వమునకు నన్ను శిక్షించుచున్నారా యని తోచుచున్నది.

ఇది వారివిషయమై కృతఘ్నత కాదు. నా అపాత్రతను గురించిన లజ్జా ప్రదర్శనము.

* * *

భయముకంటె సంభాషణ మంచిది. సంభాషణకంటె ఆవేశము మంచిది. ఆవేశముకంటె సంయమము మంచిది. సంయమము కంటె మౌనము మంచిది. భయమూలక మౌనము పతన కారణము. సంయమోత్తర మౌనము అవిరామమైన ప్రబల కార్యకర్త.

* * *

ఎప్పుడు నిరాశ కలుగసాగునో, అప్పుడు వెనుక పడియున్నవారిని, వెనుక మజిలీలను చూడవలెను ఎప్పు డహంకారము కలుగ నారంభించునో అప్పుడు ముందు వారిని ముందు మజిలీలను చూడవలయును.

* * *

ఎవడేని నా యెదుటకు నమ్రతతో శిరము వంచి వచ్చినపుడు నాకు సిగ్గు కలుగవలయును.

స్వగతము.

ఎవరు ఏదేని బాహ్య బలమువలన ఇతరులను తమ సన్నిధిని శిరము వంచునట్లు చేయుటయే తమ గౌరవముగా తలంచుచున్నారో, వారెట్టి వారు?

* * *

ఇది కూడ ఎట్టి ఆశ్చర్యము, అక్రమమయిన విషయము? నేను స్వయముగా వినమ్రుడనయి పోనభిలషింతును. అది ఆత్మోన్నతికి లక్షణమని విశ్వసింతును. కాని నమ్రతతో నా యెదుటకువచ్చు ఇతరులనుచూచి సిగ్గుచే దుఃఖముచే కలతనొందుచున్నాను.

* * *

ఎవనికి తనదోషములు తప్పిదములు కనబడుచున్నవో వాడు వినమ్రుడగుచున్నాడు. ఎవనికి ఇతరుల దోషములను, తప్పులను చూచుట అలవాటో వాడు ఉద్ధతుడు, మూర్ఖుడు.

* * *

ఎవడు సమయా సమయములందు తాను బలవంతుడనని, నిర్భయుడనని ఘోషించుచున్నాడో, వాస్తవముగా అతని దౌర్బల్యము

భయమే ఉబికి ఉబికి వానిచే నట్లు చెప్పించుచున్నవి.

*  *  *

స్వాభిమానము మానవత్వమునకు ప్రథమ లక్షణము. మానావమాన మను చక్రమునుండి తప్పించుకొనుటయే శ్రేష్ఠమయిన మానవత్వము.

*  *  *

ఎవరెవ్వరైనను బలాత్కారముగా మన స్వాభిమానమును చూర్ణముచేయ తలంచినచో మనము ప్రాణపదముగా దానికి ప్రతీకారము చేయవలెను. కాని మనంతట మనము స్వాభిమానమును మానావమానములమఱచి పోవునట్లు పరిణమింప ప్రయత్నించవలెను.

*  *  *

అవమానము గురించిన జ్ఞానము కలుగకుండుట, దానికై దుఃఖపడకుండుట జడత్వము. మఱి పశుత్వము. స్వాభిమానము యొక్క జ్ఞానమునందే ప్రకాశమును, మనుష్యత్వమును ఉన్నవి. మానావమానములకు

స్వాగతము.

అతీతు డగుట మానవత్వమును శ్రేష్ఠముగ చేయుటయే

* * *

తమోగుణమనగా జడత్వము, ప్రమాదము, అలసత, అకర్మణ్యత. రజోగుణమనగా క్రియా శీలత, సాత్త్వికగుణసారము, వివేకయుక్తమగు క్రియ, కార్యాకార్యముల సమ్యగ్జ్ఞానము.

* * *

ఎక్కడ జడత్వము, ప్రమాదము, సోమరితనము, అకర్మణ్యత రాజ్యము చేయుచున్నవో అక్కడ మనుష్యత్వము లేదు. నా యభిప్రాయములో ఈ క్రియాశీలతనుండి యే మానవత్వము ప్రారంభ మగుచున్నదని.

* * *

క్రియాశీలతలో వివేకము కూడి యున్నపుడే మానవత్వము సార్థక మగును. సఫలత నొందును.

* * *

జడత్వముకంటె ప్రయత్నము మంచిది. ప్రయత్నముకంటె శాంతి, క్షమా శీలతలు మంచివి.

* * *

ఎప్పుడైతే మనము భయపడి అణగియుం దుమో అప్పుడది క్షమయని చెప్పబడదు. ఎప్పుడు మనము దయగలవారమై ఉదారుల మగుదుమో దాని పేరు క్షమ.

* * *

అణగి యుండుటకంటె, కొట్టుట మంచిది. కొట్టుటకంటె క్షమ మంచిది.

* * *

భారత వర్షములో భగ్నకారు లెక్కువ. సఖ్యము కూర్చువారు తక్కువ.

* * *

బాహ్య శత్రువులు మన అంతశ్శత్రువులు సమకూర్చిన ఆహార పదార్థములపై జీవించు చున్నారు. కాబట్టి మానవుడా! నీవు అజాత శత్రుడవు కాగోరుదువేని, అంతశ్శత్రువులను జయింపుము.

* * *

నీవు బాహ్య శత్రువుల నయితే ఓడింప గలవు. కాని అంత శ్శత్రువులు గృహమందే పెండ్లికుమారులవలె నుందురు. అట్టిచో నీవిది

జ్ఞాపక ముంచుకొమ్ము. క్రొత్త క్రొత్త బాహ్యశత్రువులనుండి నీ సంబంధము ఎన్నడును నిన్ను విడనాడదు. ఈ అంతః శత్రువులు సమాధినుండి తిరిగి వారిని సజీవులుగ చేసి పిలుచుకొనుచున్నవి.

*　　　*　　　*

నా స్వభావము సహజముగ నేక తంత్రియే. కాని నేను జన తంత్రమునే యాచించుచున్నాను. ఇచట జన తంత్రమున కర్థము నా తంత్ర మగుట లేదా?

*　　　*　　　*

నే నెలుగెత్తి ఇట్లు చాటుచున్నాను. "ఓరీ! సాహిత్య సమ్మేళనము చేయుము. ఓయమ్మో బాదుకొని ఏడ్చుచున్నాను. కాని సభాపతిగా దొరకువారే లేరు." అదిగో! అచటనుండి బలమయిన కేక వినవచ్చుచున్నది- "ఓరీ! ఎవరికేని నాయొక్క సంకెళ్ల విచారముకూడ నున్నదా?" అని.

*　　　*　　　*

*　　　*　　　*

*　　　*　　　*

స్వగతము.

నేను సజ్జను డగుటకు ప్రయత్నింతునా, లేక బలవంతుడ నగుటకా?

*   *   *

దుర్బలుడనై జీవించుటకంటె, బలశాలి నగుటయె లక్షాంశములు మేలు. కాని సజ్జనుడ నగుట, బలశాలి నగుటకంటెను శ్రేష్ఠము కాదా?

*   *   *

ఇతరులకు సహాయపడుట పుణ్యమైనపుడు, ఇతరులవలన సహాయమును పొందుట దౌర్బల్యము, అవమానము కాదా? మనకు బలమేల కావలయును? స్వ సంరక్షణకును, పర సంరక్షణకే కదా?

*   *   *

సజ్జనత్వము మన సంరక్షణకు చాలదా? మన బలము సర్వదా పరుల సంరక్షణకే ఉపయోగ మగుచున్నదా? బలమందు సత్తా, అహంకారము, మానము, జయకాంక్ష భావములు దాగియుండ లేదా?

*   *   *

కృనగరము.

ముఖ్రోపము అహంకార స్వరూపము కాదా? అందరు నా మాటనే విశ్వసింపుడు. నా యిష్టమునకు విరుద్ధముగ మీ రేది చేసినను నేను కోపగించు కొందును. మీకు సహాయము చేయను. అని చెప్పుట ముఖ్రోప స్వభావము కాదా?

*        *        *

ఇక దేశ సేవకునకు ఇట్టి ముఖ్రోపము లాభకరమా?

*        *        *

ఎవడేని దేశ సేవకుడు, కార్యమందు నా మనసు లగ్న మగుట లేదని చెప్పినపుడు వాని కర్తవ్యనిష్ఠలో, ఆకాంక్షలో నాకు సందేహము కలుగుచున్నది. ఇది నా పతనమా? లేక వానిదా?

*        *        *

వేగము (తీవ్రత), వివేకములయొక్క సముచిత సమన్వయము వలన సఫలత యను రసాయన మేర్పడుచున్నది. ఇక వివేకము యొక్క అధిక్యతవలన అకర్మణ్యత కలుగుచున్నది.



*        *        *

యౌవనావస్థ వేగమునకు ప్రతినిధి. వృద్ధావస్థ వివేకమునకు ప్రతినిధి.

* * *

సత్యము, కాఠిన్యము ఒకే తావునందు ఉండజాలవు. సత్యాగ్రహి, ఎంత వరకు తన మాటల వలన గాని, ప్రవర్తన వలన గాని పరుల హృదయములకు నొప్పి కలుగునని విచారింపడో, అంత వరకు వాని హృదయమందు సత్యోదయము కాలేదనియే తలంపుము.

* * *

ఎక్కడ పరుల మనస్సును నొవ్వచేయనట్టి మృదుత్వము లేదో, అక్కడ అహింస యొక్క ఉనికికి సందేహమే. మరి ఎక్కడ అహింస లేదో, అక్కడ సత్యము యొక్క కల్పనము నిరర్థకమే.

* * *

మనుష్యుని దుఃఖమును విచారించుట కంటె పశువుల దుఃఖమును చింతించుట పుణ్యకార్యము. ఏల యన అవి నోరు లేనివి. తమ దుఃఖమునవి దూరము గావించుకొనజాలవు.

* * *

కాని మనుష్యుడు, తనకంటె పశువులు హీనములని తలంచి, వానిని తినివేయుచున్నాడు బ్రతికియుండగనే ప్రాణములు తీసి, వాటి మాంసమును తినుచున్నాడు. దానిపై జీవించుచున్నాడు. దాని వలన తాను బలవంతుడయి తన స్వాతంత్ర్యము పైకొనఁ గోరుచున్నాడు.

* * *

అట్టి మానవునకు లభించిన స్వాధీనత పశువుయొక్క దౌర్బల్యమున కెట్టి నిదర్శన మగును? నేడు బానిసగా నున్నప్పుడే మానవుడింత నిర్దయుడు, స్వార్థపరుడగుచో అతడు స్వాతంత్ర్య మదముతో ఉన్మత్తుడయినపుడు ఎట్టి కార్యములు చేయజాలడు?

* * *

ఈశ్వర సృష్టిలో నున్నది మానవులు మాత్రమే కాదు. దిక్కులేని, నోరులేని నిరపాయ కరములైన పశువులను, పక్షులను చంపి తినుట, ఆరగింపచేయుట, ఓరీ! సహృదయమున్నదని పశువుకంటె శ్రేష్ఠుడనని తలచు మానవుడా! నీ కది యుక్తముగ తోచుచున్నదా? మరణ సమయములో వాటి కరుణా

మయ విలాసములు నీ హృదయమును ముక్కలు ముక్కలు చేయుటలేదా? వాటి పసి పాపల కరుణాక్రందనములు నీ వజ్ర హృదయమును చలింప చేయుడగి యుండలేదా?

* * *

నేను పరుల హృదయ వేదనను లక్ష్యము చేయకయే ఏదేని మాటాడినను లేక, పనిచేసినను నేను హింసకుడ నగుటయేగాక అభిమానవంతుడనుగూడ నగుచున్నాను. నన్ను నేను గొప్పవాడనని తలచుచున్నాను. కఠినమైన, అప్రియమైన నా వచనములను ఇతరులు మాఱుమాటాడక వినుట వారి కర్తవ్యమని తలచుట కర్హుడనని నమ్ముచున్నాను. కాని వారికిని హృదయమున్నది. దుఃఖమున్నది. నా మాటలలో లోటు ఉండవచ్చునను విషయమును మఱచి పోవుచున్నాను. నా హృదయమున కెప్పుడు, ఎవరి మాటవల్లనయినను సంతాపము కలుగుచో అప్పుడు నా హృదయ మేమిచెప్పునో?

* * *

స్వగతము.

మనస్సులో కలిగిన భావము లన్నియు, సత్యములే యనియు, చెప్పునవి, చేయునవి అన్నియు సత్యములే యని విశ్వసించుట మన భ్రమయే.

*  *  *

ఎవని జీవనము పరమ సాత్త్వికమయి యున్నదో—ఎవడు సదా రాగ ద్వేష శూన్యుడో, అట్టివాని హృదయమందు సదా సత్యము యిన భావములే స్ఫురించుచుండును. ఇదొకటి. ఇక రెండవదేమన, సత్యము స్ఫురించియే యున్నను దానిని ప్రకటించుటకు సాధనము— మానవుని వాక్కు లేక లేఖిని—అపూర్ణమగు హేతువుచే ప్రకటిత భావము సంపూర్ణముగ సత్యమే యని ఘంటాపథముగ జెప్ప జాలము.

*  *  *

సత్యము కఠినమని తలంచి, ఎల్లప్పుడు అప్రియవచనములే పలుకవలెనని, లేక పరుష వచనములున్నను వాటినిగూర్చి ఉపేక్షించ వలయునని తలచుట సత్యప్రియుడగు మానవునకు నముచితము కాదు.

  *  *  *

ఏ సోదరుడు స్వరాజ్యము కొఱకు పరుల రక్తము సయితము త్యాగుడు నని పలుకుచున్నాడో అట్టివానికి స్వరాజ్యప్రేమ, స్వరాజ్య మోహము ఉన్నది. స్వరాజ్య జ్ఞానము లేదు.

* * *

వాడు స్వరాజ్యమును, ఒక వ్యక్తిని తొలగించి మఱొక వ్యక్తికొఱకు కోరుచున్నాడు. ఒక ఆదర్శము కొఱకు కాదు.

* * *

ఎవడు తన తప్పిదములను, దోషములను, దుర్గుణములను గాంచుటలేదో వాడెట్లు సత్యప్రియుడగును? ఇక నెవడు తన దోషములను చూచుచున్నాడో, వాడు పరుల విషయమై, అవినయుడు, ఉద్ధతుడు ఎట్లు కాగలడు?

* * *

వినయమనగా దౌర్బల్యముకాదు. వినయమున కర్థము విశాల హృదయము. సజ్జనత్వము.

* * *

ఎవడెంత వినమ్రుడగునో వానివాక్కులో, వాని కార్యములో అంతే బలము, ఆకర్షణ, ప్రభావము ఉండును.

* * *

స్వాగతము.

గంభీరము, వివేకశీలముగల మానవుడు, వినయవంతుడు. వాడు తనొక్క ఇసుకరేణువుగా తలంచును. అట్టివాడు ఇతరుల నేరీతిగా పరుష వచనములు మాట్లాడును?

* * *

పరుషములు పలుకుటొకటి, అప్రియమగుట వేరొకటి. మన మాటలు అప్రియకరములని ఎంతవరకు మనకు తోచునో అంతవరకు వాటి ప్రభావము తప్పక చెడుగై, విరుద్ధమై యుండును.

* * *

ఎప్పుడు నా కితరుల హృదయ వేదనను గూర్చి లక్ష్యము లేదో, అప్పుడు నా మాటల నితరులేల లక్ష్యము చేయుదురు?

* * *

నేను వాని శుభము కోరువాడను. వాని హితమునకై ప్రేరేపింపబడియే కఠినవాక్యములు పలుకుచున్నాను- దీనికి ప్రబలప్రమాణమేమి? నా హృదయ సహానుభూతి, సంవేదన, కాని సహానుభూతివలన, ఆర్ద్రమై, మృదువై, సంవేదనా వ్యథితమైన హృదయము నుండి

అగ్నిజ్వాలలు బయలువెడలునా, లేక అమృతము వర్షించునా?

* * *

ఎవరిని లక్ష్యపెట్టనని చెప్పుట నాకు మితిమీఱిన అహంకారమే యగును. నాకెవరి లక్ష్యమూ లేనిచో, ఇతరులు నన్ను కొంచెము కూడ లక్ష్యముచేయరని జ్ఞాపక ముంచుకోవలయును. ఇతరులు నన్నేల లక్ష్యముచేయుదురు? ఎవడు ఎప్పుడేని ఇతరుల ఎదుట తలవంచుటకు అభిమాన పడునో, వాడు ఒకప్పుడు గడ్డిపరకకు కూడ తలవంచుట తటస్థించును.

* * *

మరి దేశసేవకుడు, నాకెవరి లక్ష్యము లేదని ఎట్లుచెప్పగలడు? అందరిని లక్ష్యము చేయుటయే, దేశసేవకు అర్థము. ఎవడు ఎంత అధికముగ లోకులను లక్ష్యపెట్టుచున్నాడో, వాడే అంత గొప్ప దేశసేవకుడు.

* * *

ఎవడు తన్నుగూర్చి మిక్కిలి కఠినుడగుచున్నాడో, వాని ముఖమునుండి సహానుభూ

తియు, ప్రేమమయ మధురవాణియు బయలు వెడలుచున్నవి.

* * *

ఎవడు వాక్కులో కాఠిన్యమును లక్ష్యము చేయడో, వాడు కర్మయందును న్యాయాన్యాయములను విశేషముగా లక్ష్యముచేయడు. ఎవడు వాక్కును నిగ్రహించ గలిగియుండడో వానికి మృదుత్వమయమయిన ఉత్తమసంస్కారము లభింపనేరదు. వాడు కార్యమందెట్లు సంయమి కాగలడు?

* * *

స్వాతంత్ర్యము, స్వార్థము; సంయమము, పరమార్థము — అనగా ఎవడు పరమార్థము చేయుటలేదో, వానికి స్వార్థము సిద్ధించుట లేదు. ఎవడు ఎంత స్వాతంత్ర్యారాధకు డగుచున్నాడో, అతడు అంత సంయమికూడ కాజాలనిచో, అట్టివాడు స్వతంత్రతను పొందజాలడు. పొందియున్నను వెంటనే కోలుపోవును. సంయమావలంబనము లేకున్న ఇతరుల స్వా

తంత్ర్యమును తృణీకరించును. మరియు ఇతరులు వాని స్వాతంత్ర్యమును స్థిరపడనీయరు.

* * *

నా స్వాతంత్ర్యమును తగ్గించుకొని యుండను, నే నెంతవరకు పరులకు వారి సంరక్షణమును నాదరింపనో అంతవరకు నా స్వాతంత్ర్య సంప్రాప్తికి వారేల సహాయకు లగుదురు?

* * *

ధనము యొక్కయు, జనము యొక్కయు సహాయములేక ప్రపంచమం దే కార్యమును జరుగనేరదు. సహాయకుల పట్ల ఔదార్యము లేనియెడల ధనము లభింపజాలదు. జనము లభింపదు. * * *

ఆ వ్యక్తి గొప్పవాడు. ఏలయన వాడు సంస్థను నిర్మాణము చేయుచున్నాడు. మరియు ఆ సంస్థ గొప్పది. ఏలయన అది చిరస్థాయియు, సార్వజనికము నగుచున్నది.

* * *

నిజమైన ఈశ్వరసేవయేది? మానవ సేవయే. సంధ్య, ఉపాసన, పూజార్చనలు అనగా నేమి? మానవసంఘమునకు సేవనలుపయోగ్యు లగుటకు సాధనలు.

* * *

స్వగతము.

స్వాభిమానముయొక్క సంరక్షణ భావము మానవత్వమునకు ప్రారంభ లక్షణము. మానావమానములను మఱచుట మానవత్వము పూర్ణమగుటకు భావి శుభసూచన.

* * *

ఎంతవరకు మనము బాహుబలమునే శ్రేష్ఠమయిన బలముగ నమ్ముచుమో అంతవరకును మనము బాహుబలమువలన పూర్తిగా భయపడుచుందుము. ఎంతవరకు హిందువులు తాము మహమ్మదీయులకంటె బాహుబలమందు బలహీనుల మనుకొనుచుందురో మరియు బాహుబలమునే గొప్పబలమని నమ్ముదురో అంతవరకును మహమ్మదీయుల వలని భయము వారి హృదయములనుండి దూరము కాజాలదు.

* * *

ఎవని ఆత్మ ప్రసన్నముగను, నిర్భయముగను ఉండునో, వాడే బలవంతుడు. ఎవనివలన ఎప్పుడును ఎవడు భయపడుటలేదో, వాడే నిర్భయుడు. భయమే పరులను భయపెట్టుచున్నది.

* * *

స్వగతము.

హిందువులలో ఎంత ప్రేమయున్నను ధార్మిక జీవనము మిక్కిలి తక్కువ. ఇదియే అన్నింటి కంటె వారి గొప్ప దౌర్బల్యము.

* * *

దీనికి మంచి యుపాయము ధన ప్రాణముల మోహము తగ్గించుకొనుటయే. ధర్మము కొఱకు ధార్మిక జీవనము కొఱకు సదా ధనప్రాణముల సమర్పింప సంసిద్ధపడవలెను,

* * *

నేడు మనము ధర్మముపేరుతో ధన మిచ్చుచున్నారము. కాని ప్రాణము లర్పింప గోరుటలేదు. ఆ ధనము నయినను మతోన్మాదములో పడి యిచ్చుచున్నారమే కాని ధార్మిక వృత్తితో కాదు.

* * *

భయమునకు హిందువులు ధర్మము యొక్క శిష్టస్వరూపము నొసంగి హైందవసంఘమును బలహీనము గావించియున్నారు. కారణము మన గోవధపేరు వినగనే మహమ్మదీయులతో పోరాడి మరణించుచున్నారము. కాని ఆంగ్లేయులయెదుట తోకాడించుచున్నారము.

* * *

స్వాగతము

సత్యము కేవలము దూరమునుండి పూజ చేయునటి వస్తువా యేమి? అట్లు కానిచో అసత్యవాదులను, గొప్ప గొప్ప డాంబికులను గొప్పవారని యేల భావించు చున్నారము? వ్యవహారమందు అసత్యము నాశ్రయింపకయే సుఖము లభింపకున్నచో 'అసత్యాన్నాస్తి పరో ధర్మః' (అసత్యము కంటె పరమధర్మము లేదు.) అని జీవనమంత్రముగ నేల చేయబడలేదు?

* * *

దుడుకుతనము, లోబడియుండుట, ఈ రెండును పిరికితనమునకు చిహ్నములు. తేజస్విత, నమ్రత బల లక్షణములు.

* * *

సిద్ధాంతమందు పట్టుదల అనగా ఆగ్రహము, క్షుద్ర లోకాచారమందు నిరాగ్రహావృత్తి, జీవితమునకు మిక్కిలి చక్కని నియమములై యున్నవి.

* * *

సత్యము, కష్టము ఒకే వస్తువుయొక్క రెండు పార్శ్వములు. ఎక్కడ కష్టముండదో అక్కడ రఙ

సత్యము లేదనియే తలంపవలయును. కష్టము సత్యములోనికెల్ల సత్యము.

* * *

అవిచారము కంటె నతివిచారము లేక కువిచారము మంచిది. బలహీనత కంటె దురాచారము మంచిది. అభావము కంటె దుర్భావము మంచిది.

* * *

ఎవడు విపత్తువలన భయపడుచున్నాడో, వానికి వాని సంపద సయితము విపత్కరమగుచున్నది. ఎవడు విపత్తునకు స్వాగత మొసంగుచున్నాడో వానికి విపత్తు సంపత్తు అగుచున్నది?

* * *

పిఱికివాడయి యుండుటకంటెను అన్యాయము చేయుట మంచిది అన్యాయము చేయుట కంటెను అన్యాయమును సహించుట మంచిది. సశస్త్ర ప్రతీకారము కంటె నిశ్శస్త్ర ప్రతీకారము మఱెంత శ్రేష్ఠము.

* * *

స్వగతము.

ప్రేమ స్థితి బలముకంటె నధిక మయినది. ఉన్నత మయినది. బలమెక్కడ పరాజయ మందునో ప్రేమ అక్కడ విజయ మొందును. బల ప్రయోగములో నశింపు భావ ముండును. ప్రేమ ప్రయోగములో సంస్కార భావ ముండును.

* *

సంయమము స్వాతంత్ర్యము ఏ విధముగ నొకే నాణెమునకు రెండు ప్రక్కలై యున్నవో అదే విధముగా నమ్రత, నిర్భయత సహితము ఒకే వస్తువుయొక్క రెండు రూపములు.

* * *

స్వాతంత్ర్యమందు ఏవిధముగా తన అధికారముల సంరక్షణకు ప్రతిజ్ఞయు సంయమమందు పరుల అధికార సంరక్షణమందు అభయము ఉండునో అదే విధముగా నిర్భయతయందు స్వయముగ ఎవరివల్లను భయపడకుండుటకు ప్రతిజ్ఞయు నమ్రతయందు ఎవరిని భయపెట్టకుండుటకు ఆశ్వాసనము నుండును.

పిఱికివాడు, మూర్ఖుడు, వీరిరువురును ఒకరి కొకరు విపరీత గుణములు కలవారని తోచు

* * *

చున్నది. కాని వాస్తవములో వారిరువురి తత్త్వ మొక్కటియే. మూర్ఖుడు తనకంటె గొప్ప మూర్ఖుని యెదుట అణగియుండును. మూఢుడు తనకంటె నణగియుండు వాని యెదుట మూర్ఖుడగుచున్నాడు

* * *

ఎవడు ఇతరుల భయపెట్టుట లేదో వాస్తవమునకు వాడే ఇతరుల వలన భయపడుట లేదు. ఎవడితరులను భయపెట్టగలడో వాడే ఇతరుల వలన తప్పక భయపడును.

* * *

ఎంతవరకు మన మనస్సు సరసమైన, నీరసమైన, సుందర విహీనమైన వస్తువులందు భేదభావము నుంచుచుండునో అంతవరకు సూక్ష్మ బ్రహ్మచర్య పాలనము ఉపేక్షించినచో వాడు స్థూల బ్రహ్మచర్య పాలనము ఉపేక్షించు నట్టి వానికి సమానము.

* * *

మనము ధనార్జనముకొరకే ప్రపంచములో పుట్టితిమా? లేక ధర్మముకొరకా? ధనము స్థిరమయినదా? లేక ధర్మమా? అట్టిచో మనము

స్వగతము.

ధనమునకొఱకింత ఉన్మత్తుల మయిపోవుచున్నా రమేల? సారాయిలోను ధనమును సారాలోను ఏమి భేదమున్నది? ఒకడు ధనమిచ్చి త్రాగుచున్నాడు. మఱొకడు స్వయముగా ధనమునే సారాయిని త్రాగుచున్నాడు. ఇంతియేకదా?

* * *

ధర్మమే వీరత్వము. ధార్మికజీవనములో భయమునకు, పిఱికితనమునకు స్థానమే లేదు. కాని నేడు హిందూసంఘములో మతము, మతమని పలవరించుచు ప్రపంచమునకు అస్పృశ్యులుగ నుండువారై అందఱికంటె మిక్కిలి భయ భీతి గలవారై, బలహీనులై కానిపించుచున్నారు.

* * *

జీవనము ముఖ్యమా? లేక శాస్త్రమా? జీవనము ముఖ్యమా? లేక కళయా? జీవనము ముఖ్యమా? లేక సత్తాయా? జీవనము ముఖ్యమా? లేక ధనమా? * * *

జీవనమే ముఖ్యమై ఇతర విషయములు గౌణములైనపుడు లేక జీవన సాధనములైనపుడు, నేడు మన శాస్త్రములు, కళలు, సత్తా,

ధనము మున్నగునవి జీవితమునే నాశనము చేయుచుండ ఏల చూచుచున్నారము?

* * *

పహారా యిచ్చు సేవకుడే యజమాని యై యినట్లుగా జీవితమునకు సహాయభూతములైన శాస్త్రములు, కళలు, సత్తా, ధనము మున్నగునవి మన జీవన రసమును పీల్చి పీల్చి స్వయముగా యజమానులై కూర్చున్నవి. జీవనమును నిస్సహాయుడగు ఖయిదీవలె చేసివైచినవి. పీష్వాలు ఏ ప్రకారము, శివాజీ మహారాజు రాజ్యమును కబళించియుండిరో మరియు, సింధియా, హోల్కారులు పీష్వాలను అణగ ద్రొక్కియుంచిరో అదే విధముగ శాస్త్రములు కళలు, సత్తా, ధనము మున్నగునవి జీవితమునే పదభ్రష్టముగావించి, స్వయముగా తమ తమ క్షేత్రములందు రాజులై కూర్చున్నవి.

* * *

జీవనము, నశించుచున్నది. విలపించుచున్నది. శాస్త్రజ్ఞులకు శుష్క తర్క వితర్కములతో తీఱిక లేకయున్నది. జీవితము వమ్మ

స్వగతము.

గుటుగాక. మన శాస్త్రములను పాలింపవలసి నదే. కావ్యకళానిధుల స్వకీయ పరకీయ సభ లలో రాసక్రీడలకు మనము పోవలసినదే. సత్తాయాకర్త అధికారము మనము మన్నింప వలసినదే. ధనమునకు శిరమువంచి ప్రణామ ము చేయవలసినదే!

* * *

ఎవడు తన తప్పిదమును, స్వయముగ నెఱింగి సంస్కరించుకొనుచున్నాడో, మఱి దానికొఱకై ప్రాయశ్చిత్తము చేసికొను చున్నాడో వాడే సాధుపురుషుడు. ఎవడు తప్పిదమును తెలిపినమీదట అంగీకరించు చున్నాడో మఱి ఖేదమును ప్రకటించుచున్నా డో, వాడే సజ్జనుడు—సద్గృహస్థుడు. ఎవడు తప్పు తెలిసినను కూడ, మూర్ఖపు పట్టుదల వహిం చుచున్నాడో, వాడే నరపశువు. ఎవడు తప్పు ఒప్పుల జ్ఞానమునే పొందుటలేదో లేక ఎవడు తప్పిదమును ఒప్పిదముగను, ఒప్పిదమును తప్పి దముగను భావించుచున్నాడో వాడే పశువు.

* * *

అవమాన భావము అహంకారముయొక్క గుప్తమగు సూక్ష్మరూపము. ఎంతవరకు మనుష్యుడు తన్ను అధికుడని తలంచుచున్నాడో, అంతవరకు వాని ఆత్మోన్నతికి ప్రారంభము కాలేదు. ఎప్పుడు వాడు తానందరికంటె నల్పుడను లేక వినమ్రుడనని తెలిసికొనుచున్నాడో, అప్పుడే ఆధ్యాత్మికాభ్యుదయమునకు ప్రారంభమని తెలిసికొనవలయును.

*　　*　　*

అమాయక పురుషుడు (నిష్కపటి) ఈశ్వరుని పుత్రుడు. వాని అమాయకత్వమే వాని కవచము.

*　　*　　*

ఆత్మనింద, ఆత్మస్తుతియొక్క సంశోధిత (సంస్కార) స్వరూపము.

*　　*　　*

మనుష్యుని అంతఃకరణము, నిర్మలము, నిష్పాప మగుచున్నకొలది, అతనికి తన అల్పదోషములు సయితము గొప్పగా కానిపించుచున్నవి. మఱియు తన దోషముల నంగీకరించుటవలన వాని చిత్తమునకు మిక్కిలి సమా

స్వగతము.

ధ్యానము కలుగుచున్నది. అతడు తన విషయమై, కఠినుడుగను, ఇతరుల విషయమై ఉదారుడుగను అగుచున్నాడు.

* * *

శరీరముయొక్క నిర్మలతయే సత్యమైన, పూర్ణమైన నిర్మలత్వముకాదు--మనస్సుయొక్క నిర్మలతయే నిజమైన నిర్మలత్వము.

* * *

మనస్సు మిక్కిలి చంచలమైనది. ఎంతవరకది చంచలముగనుండునో అంతవరకు వెంటనే దాని చంచలతానుభవము కలుగదు. ఎప్పుడు మనస్సుమీద కొంచెము అధికారము కలుగుచున్నదో అప్పుడు దాని చంచలతా భయంకర రూపము తెలియుచున్నది. అబ్బో! అది అప్పుడప్పుడెట్టి హేయమైన, మలినమైన విచారములను సయితము చేయుచుండును?

* * *

భక్త కబీరు సత్యము చెప్పియున్నాడు. మాలను త్రిప్పుచునే యుగములు గతించె. మనశ్చంచలత నశింపదాయెను. జపమాలను త్రిప్పుటమాని, మనో మాలను త్రిప్పుము.



* * *

ఎప్పుడు మానవుడు శరీరమునుగూర్చి విచారించుచున్నాడో, అప్పుడు వాడు ఆరోగ్యవంతుడగుచున్నాడు. ఎప్పుడు మనుష్యుడు మనస్సును గురించి విచారించు చున్నాడో, అపుడు పురుషార్థియగుచున్నాడు.

* * *

ఈ ప్రపంచము మహాపురుషులకు పాదకందుకము (కాలి బంతి). ఒకడు దానిని ఒక చివరనుండి తన్నుచున్నాడు. వేఱొకడు రెండవ చివరనుండి తన్నుచున్నాడు. అది ఒక చివరనుండి రెండవ చివరవరకు నాట్యమాడుచున్నది-మధ్య ఉండుటలేదు.

* * *

ఈ ప్రపంచము మహాపురుషులకు పరిశోధనాలయము. భిన్న భిన్న సంఘములు, దేశములే, వారి ప్రయోగవస్తువులు. ఈ ప్రయోగముల మూలమున, ప్రపంచ రోగులకు, దుఃఖితులకు చికిత్స చేయుచున్నారు. ఏ సమాజముకాని, ఏ దేశముకాని, ఈ ప్రయోగముల కొఱకు కష్ట నష్టముల సహింపవలసి వచ్చినచో

స్వగతము.

"కులస్యార్థే త్యజేదకమ్" అను న్యాయాను
సారము దానినే ఆత్మ బలిదానముగా తలచి
సంతోషింపవలయును.

* * *

కేవలము బుద్ధి వికాసమునకే అధిక బల
మును ప్రయోగించినచో, కేవలము బుద్ధి వికా
సముచేతనే మానవ హృదయములోని గుణము
లకు లేక భావములకు వికాసము కలుగుట
లేదు. కేవలము భావపోషణము చేయుటవలన
సంఘములో అజ్ఞానము వృద్ధియగుచున్నది.
కేవల తర్కము అనర్థకరమును, అప్రతిష్ఠకరము
నయి యున్నది. కేవల భావన గ్రుడ్డిది. కాబట్టి
ఎవడు తర్కభావములకు ఘాతకుడో వాడు
దుష్టుడు. ఎవడు భావనాతర్కములకు శత్రువో,
వాడు అనిష్టుడు (నికృష్టుడు). ఇటులు నిర్ధారణ
చేయవలయును.

* * *

ప్రపంచమందు ఎన్ని విషయములు గోప్య
ము, గుహ్యములని తలంపబడుచున్నవో, వాటి
యన్నిటికి మూలకారణము సంయమము లేక

పోవుటయే. రహస్య దోషమునుండి, మన మెంత తొలగింప బడుదుమో మన సంయమ మంత వృద్ధి యగును. మన మెంత సంయమము కల వార మగుదుమో గోప్య మంత తగ్గిపోవును. ఘోషా పద్ధతి మన అసంయమమునే ప్రపంచమునకు చాటుచున్నది.

*    *    *

రామాయణములో సీతా రాముల కథ నిశ్చయముగాక కపోల కల్పితమా! ఏలయన భారత వర్షమందు వర్తమాన విఖ్యాత పురుషుల దాంపత్య జీవనము అట్టి సుఖమయ జీవన మగుట చాల యరుదు. వీరు ఇంటిలో సయితము దుఃఖమనుభవించు చున్నారు. అట్టిచో, సీతారాములు వనములో సయితము ఎటు సుఖవంతులై నివసించి యుండ గలిగిరి?

*    *    *

ఆర్య సాహిత్యమందు దాంపత్య ధర్మము యొక్క మహిమ గొప్పగా కీర్తింపబడి యున్నది. లక్ష్మీ నారాయణులు, గౌరీ శంకరులు, సీతా రాములు, ఈ యాదర్శ దంపతుల సృష్టి

స్వగతము.

నేటి దుఃఖమయ దాంపత్య జీవనముల కొఱకేర్పఱుప బడిన ప్రబల ప్రమాణము కాదు గదా! ఎలయన సమాజమున ఏ విషయము లోపించు చుండునో, ఆ లోటును పూర్తి చేయుటకొఱకై సంఘ నాయకులు యోగ్యమగు ఆదర్శమును సృష్టించు చుందురు.

* * *

బాహ్యాడంబర మెంత యధికముగ నుండునో అచ్చట ఆంతర్యమం దంత సందేహ మున్నదని తెలిసికొనవలెను. ఎవడు తన వస్తువును మితిమీఱి ప్రశంస చేయుచుండునో, నిరంతరము పొగడుచునే యుండునో, ఆ వస్తువు చూపుల కెంత చక్కగా నున్నను, దానిని తీసికొను సమయమందు జాగ్రత్తకలిగి యుండవలెను.

* * *

ఎక్కడ నిరాడంబరము ఉండునో, అక్కడ ధర్మము ఉండును. అక్కడనే సేవాభావము ఉండును. ఎక్కడ శృంగార ముండునో, ఎక్కడ తళుకు బెళుకు లుండునో, అక్కడ స్వార్థ మున్నది.

* * *

౫౮

పతివ్రత తన హృదయమును సద్గుణములచే నలంకరించుకొనుచున్నది. కులట తన శరీర మును ప్రకాశించు వస్త్ర భూషణములచే నలంకరించుకొనుచున్నది.

*    *    *

వేశ్యల నందఱు దూషించుచున్నారు. కాని వేశ్యాలోలురు మీసములు మెలివేయుచు సంఘములో తిరుగుచున్నారు. ఈ న్యాయ మెట్టిదో చూడుడు!

*    *    *

వ్యభిచారమునకు, వేశ్యావృత్తి వృద్ధికి బాధ్యులు పురుషులే. కాని వారే సంఘములో ఈ పతిత సోదరీలను నిందించుచున్నారు. ఈ నిర్దయకు, సిగ్గుమాలిన తనమునకు కొంచె మైన హద్దు గలదా?

*    *    *

పురుషుడన్నారో శక్తిని అబలను చేసెను. తిరిగి ఆ యబలపై నత్యాచారము చేయుచు న్నాడు. తన యీ పరాక్రమము చూచుకొని పొంగిపోవుచున్నాడు. ఈ నైచ్యమును సహిం చునట్టి ఆ పరాత్పరు డెట్టి న్యాయవంతుడు?

*    *    *

స్వగతము.

ప్రపంచములో స్త్రీరాజ్య మువచ్చినచో, పురుషుల యీ అపరాధము కొఱకు, వారి కేమి శిక్ష విధింపవలెను? నేను స్త్రీ నయినచో ఈ పర్యాయము మన్నింపవలె నని తీర్మానము చేయుదును. కాని నే నన్నా నో పురుషుడను. కాబట్టి ప్రాయశ్చిత్తమునకు బదులు నేటి వరకు స్త్రీలచేత ఏ విధముగా పురుషులు సేవ చేయించుకొనుచున్నారో, అదే విధముగ నంత కాలమువరకు స్త్రీలయొక్క సేవ చేయుదురుగాక యని తీర్మానమును ప్రవేశ పెట్టుదును.

* * *

ఆదర్శ వ్యవహారములకు పూర్వ పశ్చిమ భేద మున్నదా యేమి? ఆదర్శము కేవలము పూజించు వస్తువా యేమి?

* * *

ఏ యాదర్శానుగుణ్యముగ వ్యవహారము చేయ ప్రయత్నము జరుగుట లేదో, ఆ యాదర్శము మిథ్యయే. ఏ వ్యవహారము ఆదర్శ ప్రేరితుడై ఆదరించుట లేదో ఆ వ్యవహారము భయంకర మయినది.

* * *

వ్యవహారము వలన ఆదర్శ వాది ఉదాసీనుడుగాని విరక్తుడుగాని కాడు. వ్యవహారము ఆదర్శముల యందు ఎక్కడ విరుద్ధము సంభవించునో, అక్కడ వాడు కష్టములు సహించియయినను ఆదర్శానుసారముగ వ్యవహారము చేయ ప్రయత్నించు చున్నాడు. తాము వ్యవహార వాదుల మని తలంచు వారు అట్టి సమయములో తోక ముడుచుకొనుటయే తెలివిగల పని యని భావించు చున్నారు. ఆదర్శ వాది దీనినే బలహీనత యని చెప్పుచున్నాడు.

*　　*　　*

ప్రేమ మార్గము విచిత్ర మయినది. ఒకప్పుడు పుష్పము వలె సుకోమలమై, మఱొకప్పుడు కంటక పరిపూర్ణమై యుండును. ఒకప్పుడు చక్కని మార్గము లభించును. వేఱొకప్పుడు గభీరమైన, నిలువైన కందకము కానిపించును. ఇంక ప్రేమాభిలాషులు పరమాత్మను భజింపుచు ఆ కందకములో, ఆ ముండ్లలో కండ్లు మూసికొని దుముక వలసి వచ్చును. అంతరంగిక నిర్మలత్వము సిద్ధించుట కొఱకు

స్వగతము.

ప్రపంచములో నిజమయిన ప్రేమ కలవారికి అసంభవ మయిన వస్తువే లేదు.

* * *

ఒక సత్పురుషుని ఎవ రయినను వానిని అప్రామాణికు డని గాని, కపటి యని గాని దూషించినపుడు కలిగిన దుఃఖము మూర్ఖుడని పిలిచినపుడు కలుగదు. బుద్ధి పరమాత్ముని వరదానము. కాని హృదయ పవిత్రత లేక నిర్మలత ప్రత్యేకము మానవుని సంపత్తి కదా!

* * *

విషము త్రాగి ఎన్నడును పరీక్ష చేయకుము. "శఠే శాఠ్యమ్"(ధూర్తునియందు ధూర్తత్వము ప్రయోగించుట). ఇది ఇరువురను పతితులను చేయును. ఈ నియమము నుపయోగించువాడు తన పవిత్రతను, తెలివిని డంబముగా చెప్పుకొనని మ్మె.

* * *

ఏ విషయము ఉచితమో దానిని చేయుట కంటె మంచి దనుకొన్న దానినే మన మేల చేయ ప్రయత్నించు చున్నారము? ఎందుకనగా మనకు పురుషార్థమందు ప్రేమ లేదు

గనుక. ఇంతియే గాక మన మనస్సు విషయ విలాసములకై పిపాస కలిగి యున్నది గనుక.

*　　　*　　　*

అన్యాయము చేయువాని వంటి పిఱికివాడు లేడు. మఱి అన్యాయమును పొంది ప్రతిఘటింపని వాని వంటి జడుడు లేక అన్యాయస్థుడు లేడు.

*　　　*　　　*

మన దేశములో గొప్ప ఆశావాది (మిత వాది) పక్షము కలదు. అయిన వారికి ఆ యాశా కల్పనయే వారి జీవితమునకు సరిపోవు చున్నది. బర్కెను పెద్ద ప్రభువు తిరస్కరించిన నేమి? లార్డు రీడింగు వచ్చి కొంచములో కొంతయయిన ప్రసాదింపకుండునా? అయ్యో! మనకు భగవాను డిట్టి యాశావాదము నొసంగలేదు. లేకున్న ఈ చరఖా చక్రమునుండి తొలగిపోయెడి వారమేకదా!

*　　　*　　　*

బుద్ధిమంతుని కింత మాత్రమైన తోపదా? ఇతరుల దయా భిక్షముపై నాధారపడి తమ జన్మ హక్కును కోల్పోవుదురా?

*　　　*　　　*

"తపాంతే రాజ్యమ్ రాజ్యాంతే నరకమ్" (తపస్సు అంతమందు రాజ్యము, రాజ్యాంతమందు నరకము). ఈ సూత్రమును రచించిన వాడు దూర దృష్టి కలవాడు. వాడెన్నియో మన స్వదేశ సంస్థానముల భవిష్యత్తును ముందే గ్రహించి యున్నాడు.

* * *

ఇప్పుడు భారత దేశము వ్యాపారములో వాంగ్లేయులను కూడ పడగొట్ట గలదు. ఏలయన మూల ధనము లేకయే, విజ్ఞాపన, ప్రకటన, పోటీ అవసరము లేకయే దైనికాదాయము నిచ్చు క్షేత్రము చేజిక్కినది.

* * *

భారత దేశమం దెల్లెడ విజ్ఞాపన పత్ర ప్రకటన రోగము వక్రమార్గమున వృద్ధి యగుచున్నది. ఏ విధముగ నయినను గ్రాహకులను లోభ పెట్టుట యధర్మముగ నెంచుట లేదు. అత్యుక్తి, అసత్యము తుదకు మోసముచే కూడ అక్కడక్కడ పని గడుపుకొనుచున్నారు. ఇది దేశ దౌర్భాగ్యమునకు లక్షణము. ఇది దేశముయొక్క సాహిత్యాభి

వృద్ధి యను పేరుతో దాని నధోగతి గావించు ప్రయత్నమై యున్నది.

*　　　*　　　*

పత్రికలు, గ్రంథముల ద్వారా ఒక వైపున మనము పాఠకులకు నీతి, జ్ఞానము, ధర్మము, మున్నగు సద్విషయములను బోధించు చున్నారము. మఱొక ప్రక్క ఎన్నో అనుచితములు, అనావశ్యకము లైన విషయములనేగాక విస్పష్టముగా హానికరములగు విజ్ఞాపనల ద్వారా ఆ విషయములకే విరుద్ధాచరణము గావింప ప్రేరేపించు చున్నారము. ఈ సతీ, వేశ్యల సంయోగము దేశమందు మిక్కిలి అనర్థము కలిగించు చున్నది. ఖేద మేమన, మన మింకను కండ్లు తెఱచుట లేదు.

*　　　*　　　*

ఇంత కంటె దుఃఖకరమైన విషయ మేమన, మన ఉత్తమోత్తమ పత్రికా రాజములకు తమ నిర్వహణము కొఱకు ప్రకటనల సహాయము నైకొనుట తప్పనిసరి యగుచున్నది. మనము కండ్లు మూసికొని, పాశ్చాత్య పత్రికల

స్వగతము.

వాశ్రితల ననుసరించుచు న్నాము. మన దేశీయ సభ్యత, సంస్కృతి, ప్రకృతి సౌభాగ్యమును మఱచిపోవు చున్నాము. మానము మన పత్రికలలో చాల భాగము నిరర్థక విషయములను ప్రకటించినచో మన మీ యవినీతి మూలక కార్యముల నుండి చాల వరకు సంరక్షింప బడుదుము.

* * *

వ్యాపారోద్దేశ్యము జీవితమున కావశ్యకములైన, ఉపయోగకరములైన వస్తువులను, ఒక స్థలము నుండి మఱియొక స్థలమునకు చేర్చుటయే. ఇట్టి పరిశ్రమను గైకొనుటయే వర్తకునకు లాభము. ఇప్పుడో లాభమే వర్తకునకు ముఖ్యోద్దేశ్యము. సుఖము కలిగించుటకు బదులు దోపిడియే ధర్మమాయెను.

* * *

ఇప్పుడు వ్యాపారము అవసరము కొఱకు జరుగుట లేదు. లోభము కొఱకే జరుగుచున్నది. అడిగినవి సమకూర్చుట లేదు. కాని క్రొత్త క్రొత్త కోరికలను కలిగించుచున్నారు.

రోగమునకు మందిచ్చుట లేదు సరిగదా, క్రొత్త క్రొత్త రోగముల నుత్పత్తి చేయుచున్నారు

*　　*　　*

ఇప్పుడు సాహిత్యము, జ్ఞానము సయితము వ్యాపారము కా సాగెను. దీనికిని కంపెనీలు తెఱువబడుచున్నవి. వాటాలు వేయబడుచున్నవి. కన్యల వ్యాపార మన్ననో అనేక వర్తకుల కడ జరుగుచున్నది. ఇక జరుగవలసిన దెవరికి? తల్లిదండ్రుల యొక్కయా? లేక —?

*　　*　　*

సాహిత్య వ్యాపారి సాహిత్య వ్యాపారమునే ఉత్తమముగ తలచుచున్నాడు. కావచ్చును. నా మందమతికి వస్తువెంత శ్రేష్ఠమయినదో, దాని వ్యాపారము అంత నికృష్టమైనదిగ కానిపించుచున్నది.

*　　*　　*

దేశములో ఫేషనులు, భోగ విలాసములను పెంపొందించుటలో మన పత్రిక లెంత సహకారులాయెనో అంతే ప్రకాశకులు,

స్వాగతము.

సంపాదకులు సయితము పాప భాగ స్వాము లయి యున్నారు.

* * *

లేఖకులు లేఖలను, గ్రంథములను వ్రాసి పాఱవేయుటయు, ప్రకాశకులు గ్రంధములను ముద్రించి పడవేయుటయు తమ వృత్తిగా చేసి కొని యున్నారు. గ్రాహకులను భోగ విలాస ములకై ప్రేరేపించి రకరకములైన, ఆకర్ష ణీయములైన, ప్రకాశవంతములైన, రస ముట్టిపడు నట్టియు, సుందరములైన విషయము లను వారి యెదుట పెట్టి తమ స్వార్థమునకు తంటాలు పడుచున్నారు. వారి ధనము వల్లనే వారి అధోగతికి ఉపాయము సూచించు చున్నారు.

* * *

లేఖకుడు జ్ఞాన దానమునకై స్థల మిచ్చుట లేదు. ప్రకాశకుడు జ్ఞాన ప్రకాశమునకై గ్రంధముల నచ్చొత్తించుట లేదు. ఒకడు పొట్ట పూజ కొఱకు. మఱొకడు జేబు నింపు కొనుట కొఱకు. నిజమైన సేవకులు తక్కువ.

* * *

స్వగతము.

ఆశ్రమములోని ఒక వితంతు సోదరి కొఱకు నేను భర్తృహరి వైరాగ్య శతకము నొక దానిని తెప్పించితిని. అయిదు రూప్యములకు వీ.పి. వచ్చినది. "వైరాగ్యము శతకము వచ్చినదా" యని స్వాభావికముగా నడిగితిని. ఆమె సరళ స్వభావముతో "గొప్ప ఫ్యాన్సీ పుస్తకము వచ్చెను!" అని చెప్పెను. దాని విలువ అయిదు రూపాయలు! నే నిది విని చకితుడ నయితిని. వైరాగ్య శతకమా? అయిదు రూపాయల విలువా? ఆశ్చర్యము! ఆ గ్రంథము యొక్క అట్ట చూచినగనే, ఏదైన శృంగార శతకము వచ్చి యుండదుకదా! యని భ్రమ పడితిని.

* * *

నే నంత పుస్తకమును పరిశీలింప సాగితిని. నా దృష్టి అందున్న చిత్రములపై పడెను. నా హృదయము కంపించెను. ఇది వైరాగ్య శతకమా? లేక శృంగారపు సినీమా?

* * *

వైరాగ్య శతకము యొక్క స్థితియే యిట్లున్నపుడు శృంగార శతకము గతి యెట్లుండును? విచిత్రము!

* * *

ఇక పుస్తకము చదువ నారంభించితిని. నా దుఃఖమున కంతము లేదు లేఖకుడు స్త్రీలను గూర్చి అనుచితముగా, అనుదారతగా చేసిన ఆక్షేపణలు, వారిని నిందింప తగని నింద యయి యున్నది. దానిని జూచి నా రక్తము ఉడికి పోయెను. స్త్రీ జాతిపై నిరంతరము అన్యాయము చేయు పురుషుడు ఏ మొగముతో స్త్రీలను దూషింప గడగు చున్నాడు?

* * *

గ్రంధ మందున్న దూషిత చిత్రముల నెన్నిటినో చింపి వేసితిని. లేఖకుడు స్త్రీల విషయమై వెళ్ళ గ్రక్కిన దూషణ భాగములు గల పుట లెన్నింటినో కుట్టివేసిన పిదపనే ఆ గ్రంథము నా సోదరి కడ నుండ తగిన దని తలంచితిని. అట్టి గ్రంథముల ప్రకటింప సాహసించుట సాహిత్య ప్రియుల రుచి నవమానించుటయే.

* * *

ఈ గ్రంధమును ఈ రూపముతో పరీక్షించి ప్రకాశకుడు భర్తృహరికి క్షమింపరాని అపరాధమును కావించి యున్నాడు.



* * *

మన సంఘ మిట్టి అన్యాయస్థులను, మూర్ఖులను ఎట్లు సహింపగలుగు చున్నది? దానిని గుర్తింప లేదా? లేక దాని మతి పోయినదా?

*　　*　　*

సాహిత్య విమర్శకాగ్రగణ్యులు ఏల మిన్నకుండిరి? వారు కూడ స్వయముగా మోహాగ్రస్తులైనారా? లేక వారి సాహసము వమ్మయ్యెనా?

*　　*　　*

హిందీ భాషలో "భంగీ" (పాకీ వాడు) పత్రికకు ఆవశ్యకత కలదు. అస్పృశ్యులను దూరము గావించుటకొక మహా పురుషుడవతరించి యున్నాడు. ఓ భగవానుడా! హిందీ సాహిత్యమందు సయితము ఎవడేని శక్తిమంతుడైన ఒక భంగీని ప్రసాదింపుము. వాడు తన చీపురుచే మైల నంతను పరిశుభ్రము చేయుచునే యుండును గాక!

*　　*　　*

హోలీ పండుగ దినములలో మన సంపాదకులకు కూడ ఏల మత్తెక్కు చున్నది? పది కొండు మాసములు పరదా యందున్న కారణము చేత నా యేమి?

*　　*　　*

స్వగతము.

భంగు (గంజాయి) భవానీ యొక్క సత్తా అపారము. తీర్థస్థలము యొక్క బలమైన పండాలు పురోహితుల మీదనే గాక ఎంత మందియో మనో బలము కలిగిన సాహిత్య సేవకుల మీద గూడ దాని ప్రభావ మధిక ముగా సాగుచున్నది. కాదు! దాని సహా యము చేతనే వారు తమ మనస్సును దృఢము చేసికొను చున్నారు.

* * *

స్త్రీలు తల్లులా? కావచ్చును.—శుష్క వేదాంతుల దగ్గర స్త్రీలు తల్లులు కావచ్చును. గంజాయి త్రాగు వారి కడ స్త్రీలు తల్లులు కావచ్చును. మా వ్యాపారస్థుల దృష్టిలో మాత్రము తల్లులు వెనుక బడుచున్నారు. కాని అందరు అట్లు కాదు.

* * *

మఱియు సౌందర్య రసికులును, మన సాహిత్య కావ్య ప్రియుల ఎదుట స్త్రీలు అనేక భేద ప్రభేదములతో కూడిన నాయికా మణు లై యుండిరి. వారు లేనిదే రస మేమి? రసము లేనిదే కవిత్వమేమి?



* * *

భారతీయుల ఆరాధన కూడ విచిత్రమయి నది. స్వారాజ్యము మాట యటుండ నిమ్ము. కాని మా కామశాస్త్ర విద్యాలయములు ముందె తెఱతురుగాక!

* * *

అయ్యో! అశ్లీలత, అశ్లీలత యని ఎందుకీ గోల? మీ శరీరములో అశ్లీలత లేదా యేమి? అశ్లీలముగ నెంచబడు కార్యమును మీరు స్వయముగ చేయుట లేదా యేమి? తిరిగి అశ్లీలతా గీతము లేల పాడుచున్నారు? ఏది నీవు ఏకాంతముగ చేయుచున్నావో దానినే మేము పది మంది యెదుట చేయుటలో తప్పే మున్నది? దానిని ప్రచారము చేయుటలో ఏమి పాప మున్నది? దానిని బోధించుట ఏమి అధర్మము?

* * *

ఏ విషయములు హేయమైనవో, వేని కల్పన మాత్రము చేతనే, మన సంస్కరింప బడిన, సురుచి సంపన్నమైన మనస్సునకు అసహ్యము కలుగవలెనో అట్టి వానికే "కళ" యనియు "సౌందర్య" మనియు ఎటువంటి శిష్టమైన, భవ్యమైన నామములు పెట్టబడినవి? ఓ మాన

* * *

స్వాగతము.

వుడా! ఇంద్రియాధీనమై దాగియున్న నీ హా
స్తము నీచే నేమి చేయింపజాలదు?

*　　*　　*

ప్రపంచములో అశ్లీలత తక్కువగా నున్న
దా యేమి? మనము కూడ దాని నింక వ్యా
పింప చేయుటకు?

*　　*　　*

గౌరవనీయ సాహిత్య రసికుడగు గుజరాతీ
మిత్రు డొకడు "మతవాల" పత్రికకు గొప్ప
భక్తుడై యుండెను. దాని కొఱకై జ్ఞాపక
ముంచుకొని నేనా పత్రికను జాగ్రత్త పెట్టు
చుంటిని. కాని అతడు ఎప్పటినుండి "హోలీ
పండుగ" సంచికను మఱి దాని అవశిష్ట హోలీ
అంకమును చదివెనో, అప్పటి నుండియు అతడు
"మతవాల" పేరయినను, తలంప లేదు. శ్రీ
వాస్తవజీ, గోస్వామి జీల యొక్క హోలీ
స్వరూపముల గాంచి ఒకవేళ వారి సంస్కృత
ఆత్మల యొక్కయు, పరిష్కృత రుచి యొక్క
యు, మూర్ఛ వాని కేమియు కలుగ లేదు కదా!

*　　*　　*

స్వగతము.

"ప్రభ" అను పత్రికను ఎవరో హిందూ సాహిత్య సన్యాసిని అని చెప్పి యుండిరి. నా కది దానిని స్తుతించి నట్లు వ్యక్త మయ్యెను. "ప్రభ"దీని కంగీకరింప నట్లు తెలియు చున్నది. "గ్రీష్మ యువతి" ఇత్యాది విషయములను గైకొని ప్రత్యక్షము కాలేదా?

* * *

"మతవాల" మనుష్యుని అనగా పిచ్చివానిని సమాజము బహిష్కరించు చున్నది. కాని "మతవాల" పత్రికను సమాజము తలను దాల్చు చున్నది. మొదటి నుండియు పత్రిక సమాజ మునకు సేవ చేయు చున్నదా యేమి? దీనినే "రుచీనాం వైచిత్ర్యమ్" (రుచుల వైచిత్ర్యము) అని చెప్పుదురు.

* * *

ఒక మిత్రుడు ఒక రోజున ఇట్లు చెప్పెను. అయ్యా! ప్రస్తుతము ప్రజల ప్రతి మాటలోను అశ్లీలతా వాసన వచ్చు చున్నది. ఒక చిత్రములో కృష్ణుడు, వెనుక నుండి గోపిక చీర చెఱగు పట్టుకొను చున్నాడు. చాలు! ప్రారంభ మాయెను శృంగార లీల! నే నిట్లు విన్నవించి

స్వగతము.

తిని. అయ్యో! దారిని పోవు గోపిక చెంగు పట్టుకొనుటకు, పరిహాసము చేయుటకు, ఆ కృష్ణున కేమి వచ్చెను? ఈ పరిహాస రసము తక్క ఏమంత ఆకర్షణ మున్న దని పత్రికా సంపాదకుడు దానికి పత్రికలో స్థాన మిచ్చెను?

*　　*　　*

హిందీ సాహిత్య మందు ఇప్పుడే ఉత్సాహము కలుగు చున్నది.— యౌవ నారంభము యొక్క ఆవేశ మున్నది. సంయమ యౌవనమే సఫలమగు యౌవనము కాగలదు. సఫలమగు యౌవనము వృద్ధాప్య సౌఖ్యము నకు పూర్వ చిహ్నము.

*　　*　　*

హిందీ సాహిత్య సేవకుల సంఖ్య అభివృద్ధి పొందు చున్నది. ఇది సంతోష కరమగు విషయము. కాని ఎప్పుడు గుణ బల మధికమగునో అప్పుడే ఇది శుభ చిహ్న మగును.

*　　*　　*

వివేచనా శక్తి, ఆలోచనా శక్తి, ప్రౌఢమైన, పుష్టి యాయిన బుద్ధికి లక్షణములు. మరియు, నిర్దోషము, వినోదము, నిరోగము

ఇవి ప్రతిభా లక్షణములు. ఛిద్రాన్వేషణము, కటువైన ఆక్షేపణము, విషయుక్తమైన వ్యంగ్యము, వికృతి బుద్ధియొక్క దిగంబర నృత్యము.

*　　*　　*

హిందీ సాహిత్యము ఇప్పుడే అనువాద యుగము నుండి గడచు చున్నది. ఏమి? ఇది "పర ప్రత్యయానేయ బుద్ధిః" లక్షణము కాదా ఏమి? ఎవరయినను దీనికి సమాధాన మొసంగ గలరు.— "వినాశ్రయేణ శోభన్తే పండితాః వనితా లతాః" (ఆశ్రయము లేకయే పండితులు, స్త్రీలు, లతలు శోభించు చున్నవి.) హిందీ పండితులు, వనితా లతలతో చేర్చి నందులకు అవమానముగా తలంప కుందురు గాక! లేదండీ! వీటి మధ్య వారు తాము గొప్ప అదృష్ట వంతులమని తలంతురు.

*　　*　　*

ఆంగ్ల కవుల పద్యములను చదివినచో వారి కవిత కొండల యందెగురుచు, దుముకుచు, ప్రకాశించెడి సెలయేటి ప్రవాహము వలె తోచును. భారత కవుల పద్య ధోరణి గగా

స్వగతము.

ప్రవాహమందు పడవ మీద గూర్చుండి ప్రయాణము చేయుచుంటిని.

* * *

ప్రతిభకు కీలకము మత్తు. ఏల యన ఎందరో హిందీ లేఖకులు, సంపాదకులు, కవులు ఏదో యొక మత్తు పదార్థము సేవింప నంత వరకు వారి ప్రతిభ ప్రకాశించుట లేదు. సాహిత్య సేవకులు బహుశా వేషమునకు సచ్చరిత్రను కరణము— మరియు కేవలము పరోపదేశము చేయుటకే తగియున్నారు. అట్లు కానిచో సదాచారి ఇంటింటికిని పరుగెత్తుటేల సంభవించును? మరియు దురాచారి కేల పేరు ప్రతిష్ఠలు కలుగును? విశ్వసింపనిచో పరిశీలనము చేసి చూడుడు.

* * *

కళ కర్ధము సృష్టి; శాస్త్రమున కర్ధము ఖండన ముండనము చేయుట. కళ కర్ధము హృదయము; శాస్త్రమున కర్ధము బుద్ధి. కళ కర్ధము సౌందర్యము; శాస్త్రమున కర్ధము ఉపయోగము. కళ కర్ధము సంయోగము. శాస్త్రమున కర్ధము వియోగము.

 * * *

వనిత ఈశ్వరుని కవిత. కవిత కవికి వనిత. లత కవితా వనితల కిరువురకు సహకారియే.

* * *

కాళిదాసుని కావ్య సృష్టి మనోహర మయినది. మోహన మయినది. భవభూతి కావ్య సృష్టి, సాధ్వి, పవిత్రత. కాళిదాసుని దుష్యంతుడు ఎప్పుడు శకుంతలపై ప్రేమాసక్తు డగుచున్నాడో, ఇరువురి యొక్క హృత్తంత్రుల నుండి సంవాద రూపమగు సుస్వర ఝంకారము వెలువడసాగునో అప్పుడు పాఠకుడు తన హృదయ తంత్రులను కూడ సడిల పఱచుకొన వలసి యుండును. కాని భవభూతి 'రాముడు' చెక్కిలిపై చెక్కిలి చేర్చి వార్తాలాపము చేయు చున్నంత వఱకు, ఆ విషయములు చెప్పుతఱి పాఠకుల నయనముల నుండి అశ్రువులు జలజల రాలుచుండును. శకుంతల అనురాగము వ్యామోహ కర మైనది. ఉత్తర రామ చరితములోని కరుణ శృంగార రసములు అంత ర్వృత్తిని మేలుకొలిపి పరిశుద్ధము గావించు చున్నవి.

* * *

స్వగతము.

వాల్మీకి రామాయణము కళా సృష్టి. తులసీ రామాయణము భక్తి భాగీరధి.

* * *

దేవ, పద్మాకర, బీహారీ కవులు నాయకు రాండ్ర నెపముతో వారల జీవితము నే నాశము గావించుకొనిరి. తులసీ సూర దాసులు భావ సౌందర్యమునకు భక్తులు. దేవ, పద్మాకర, బీహారీలు రూప సౌందర్యము లందు ఆసక్తు యయిరి.

* * *

కొందఱి భావమే మన హిందీ గద్య రచన యొక్క కాఠిన్యము వ్రజ భాషా సౌకుమార్య మును నాశము గావించి హిందీ సమాజమును చిక్కు పఱచిన దని చెప్పుదురు. గాయపడిన లేడి వంటి వ్రజ భాష యొక్క మంద కరుణా క్రందనమును కొందఱు సహృదయు లగు మిత్రు లు విని యుండిరి. వారు దాని సుకుమారత అను పేరుతో అపీలు చేయ నారంభించిరి. హిందీ గద్య రచన (ఖడీబోలీ) సంస్కృత మాతను సాక్ష్యము కొఱకు పిలిపించెను. వ్యవ హారము చెడుట చూచి పండిత రామ నరేశ

త్రిపాఠీగారు సంధి కొలక్కై "కవికౌముది" ని తీసికొని వచ్చిరి. రెండు పక్షములవారికి రాజీ చేయు కఠిన కర్తవ్యమును వా రంగీకరించు చున్నారు. పరమాత్ముడు వారి గౌరవమును కాపాడునుగాక!

*    *    *

హిందీలో (ఆంధ్రములో) దిన దినము కవులు అసంఖ్యాకులై పోవుచున్నారు; ఆశు కవులు, ఉద్దండ కవులు, ఉద్భట కవులు, ఈ రీతిగ అనేక రకములుగ కవులు నిత్యము పుట్టుచు న్నారు. ఇది కొంత మందికి కడుపు మంట! అది పట్టజాలక వారికి తల్లి దండ్రులు లేక పోయి నచో పత్రికాధిపతులే వారికి చాల వరకు పాలకు లగు చున్నా రని గూడ మొర బెట్టు చున్నారు. ఇట్టి వారు ముందీ కార్యము చేయ వలసి యుండు నని నా యుద్దేశ్యము. వర్షా కాలములో భగవంతుడు అనేక వాన పాము లను, కప్పలను పుట్టించు చున్నాడు. వాని స్వార్థ మెంత వర కుండునో అంత వరకును ఆ జీవుల పాలన పోషణ ఆయనయే చేయు చున్నాడు.

కాఁబట్టి పరమేశ్వరుని యొక్క ఈ యలవాటును గూడ వారు సరి జేయవలసి యుండును గదా!

* * *

కొంత మంది మిక్కిలి తెల్విక స్వభావముతో గాంధిగారి అనుచరులకు బుద్ధి కొఱవడి యున్నదని నుడువు చున్నారు. కనుకనే గాంధి గా రెక్కడకు తోలిన అక్కడకు పోవు చున్నారని చెప్పుచున్నారు. నే నిట్లు చెప్పు చున్నాను.— అవును. వారిలో నధిక మైతే లేదు. కాని గాంధిజీ వంటి విశ్వ విభూతిని గుర్తింప గల బుద్ధి మాత్రము వారికి కలదని చెప్పక తప్పదు. కనుకనే వారిని గౌరవింప గల్గు చున్నారు.

* * *

సుశిక్షల విశ్వాసముతో పాటు ప్రలోభనముల నెదుర్కొను చున్నారు. మద్యమునకు విముఖు లగుచున్నారు. దారిద్ర్య జీవనమును గడపు చున్నారు. కూలీల వలె దేశ కార్యములను చేయు చున్నారు. అనుభవము గల కార్యములనే చేయుచు నిజమైన సైనికుల

వలె సైన్యములో చేరుచున్నారు. అనుశాసనము, ఆజ్ఞాపాలనము మొదలగు నియమ పాలనము చేయుచున్నారు. ఇవన్నియును బుద్ధిహీనత యొక్క లక్షణములా యేమి? ఇక కేవలము కబురులు చెప్పుట, కేవలము ఛిద్రాన్వేషణము చేయుట, కేవలము లేఖలు వ్రాయుటే బుద్ధి లక్షణమా ఏమి?

* * *

ఒక మిత్రుడు చెప్పెనెను. — సోదరా? ఆశ్రమము లో ఉన్నపిదప మీకు ఆధ్యాత్మికోన్నతి కలిగినట్లు నే గాంచు చున్నాను. అప్పుడు నే నిట్లు సమాధాన మిచ్చితిని. నా స్థితిని నా తల్లి దండ్రులను, నా సోదరుని, నా భార్యను అడిగి తెలిసికొమ్ము. సామాజిక స్వరూపము మానవుని నిజ స్వరూపము కాదు. ఆతని నిజ స్వరూపము కుటుంబములోనె విశద మగును.

* * *

అప్రియముగ సత్యము పలుకువారు మిక్కిలి అరుదుగా నుందు రని తలచుగా జనులు తలంచు చుందురు. నా స్వానుభవ మేమన ప్రియముగ సత్యమును జెప్పుటయే మిక్కిలి కష్టము.

* * *

స్వగతము.

మనుష్యుఁడు సత్యమునకు సన్నిధిగా జేరుచున్న కొలఁది వాని హృదయ కోమలత్వము వృద్ధి యగును. వాఙ్మాధుర్యము వర్ధిల్లును.

* * *

ఒక పల్లెటూరు మిత్రుడిట్లు చెప్పెను. అయ్యా! శాస్త్రిగారూ! ఏమండీ? చూడండి! ధాన్యముతో నిండి యున్న ఆ పెద్ద బానలను! వాటిలో జ్ఞాన ధాన్యము, కుతికల కంటె నిండి యున్నది. కాని అది బానల కొఱకా! కాదు. మఱి లోకుల ఉపయోగము కొఱకే!

* * *

నాకు తక్కువలో తక్కువ పని కావలెను. ధన మధికముగా లభింప వలయును. ఇట్టి యాదర్శము మానవుని యొక్క పతనమునకు మూల కారణమే యగును. ఇట్టి యాదర్శవాది తఱచుగా సంఘ చోరుడై యుండును. వాఁడు సంఘ సేవ చేయఁ గోరు చుండును. కాని; తాను మాత్రము మిక్కిలి తక్కువగా పని చేయ నభిలషించును.

* * *

జయంతి అనఁగా నేమి? మహా పురుషుల జన్మ కర్మోద్దేశ్యము మన హృదయములలో ఉదయ మగుటే. మఱి దాని సంతోషము?

*　　*　　*

సామాన్య మానవుల జన్మ దినోత్సవమును మనము "జయంతి" అని పిలువము. మన జన్మ గ్రంధి దినమో అది యంత్రిత విలాసము! అంతులేని విందులకు భోగ దినము. బహుశా అందు వలన ఈ జీవితములో ఒక సంవత్సరము సులభముగా గడచి పోయె నను భావము లేదు గదా!

*　　*　　*

సామాన్య మానవుని జన్మ దినమున ఆనందోత్సవములు జరుపుట హాని కరము. అజ్ఞానులగు ప్రజ లందు వలన దిక్కులే మరచి పోదురు. రాజుల జన్మ దినోత్సవముల వలన వందల కొలఁది ఉదాహరణములలో లాభమునకు బదులు నష్టమే కానుపించు చున్నది.

*　　*　　*

నేను భగవంతుఁడ నైనచో ప్రపంచములో రాజు లందఱు హృదయములలో ప్రవేశించి

స్వగతము.

యిట్లు ప్రేరణ జేతును. వత్సా! నీవు నీ ప్రియ మిత్రులతో, నీ ప్రజలతో ఇట్లు చెప్పుము. నా జన్మ దినమున ఇంత ఉత్సవమును సంతోష ముగా జరుపుట వలన మీ కేమి లాభము కలుగును? నేను సహితము మీ వంటి మానవుండనే గదా? స్వామ్మి. ఏ మహాత్ముని చరణ కమలము లందైన మీ శ్రద్ధాంజలిని సమర్పింపుడు. ఆయననే పూజింపుడు. ఆయన వలన మీకు జ్ఞానము లభించును. ఈ రీతిగ అంధులై మీరు నన్ను పూజించుట వలన మన మిరువురము పతితులమే యగుదుము.

* * *

ఒక వేళ నేనే రాజ గురువు నైనచో రాజులతో నే నిట్లు చెప్పుదును. వత్సలారా? నేటి నుండి మీరు రాబోవు వత్సరమునకై ప్రతిన నులు కావలెను. సమస్త ప్రజలతోను పరిశుద్ధులై ప్రార్థన సలుపు నటుల చెప్పుదురుగాక! మీరు సహితము సంయము పూర్వకముగ నుండుడు. పరమాత్మ నిట్లు ప్రార్థింపుడు. ఓ సర్వేశ్వరా! సర్వ శక్తి సంపన్నుండా! నీ దయ

వలన నన్నింత భాగ్యశాలిగ జేసి యున్నావు. నీకు నా యందు అపారమైన కృప యున్నది. సర్వ భూతములకు సేవ సలుపుటకై నా కింత సాధన సంపత్తి నొసంగి యున్నావు. కాని ఓ పరమాత్మా? నే నొక సాధారణ మానవుఁడను. నా వలన ఎట్టి అపరాధములైన కలిగి యున్నచో నన్ను క్షమింపుము. ఇప్పుడు నా కర్తవ్యమును యథావిధిగ పాలించు శక్తిని, బలమును ప్రసాదింపుము.

* * *

ప్రస్తుతము హిందూ మహమ్మదీయులలో "హారతులు, వాయిద్యముల" గూర్చి పోరాటము లనేకములు జరుగు చున్నవి. హారతులు, వాయిద్యములు యాదార్థ్యమున కింత హాని కరములా యేమి? వాస్తవమున కవి మన మతమున కంత ఆవశ్యములైన ప్రధానాంగములుగా నున్నవా యేమి?

* * *

నేను అనేక సారులు ఇతరుల దోషములను జూచి చూచి దుఃఖించు చున్నాను. మఱి

ప్యాగతము.

ఉపదేశము చేయ మొదలిడు చున్నాను. అప్పు
డప్పుడు ఇది చెప్పి చెప్పి అలసి కూడ పోవు
చున్నాను. కాని మార్గము తప్పి పోయిన ప్రతి
పక్షులను దారికి తెచ్చుటలో నే నంత సమ
ర్థుడను కాజాలక పోతిని.

* * *

కాని ఆ మరు క్షణమే నా యాంతర్యము
జూడ గడంగుదును. నే నప్పు డేమి చూడ గల్గు
దును? నా యందే వందల కొలది దోషములు
నిండి యున్నట్లు స్వయముగా గ్రహింతును.
నే నప్పుడు లజ్జా వశుడనై వంగి కుంగి పోవు
దును. లోనుండి ఒక చిన్న అంతర్వాణి యిట్లు
చెప్పును. నీ లోపములను ముందు దూరము
గావించుకొను ప్రయత్నములో నిమగ్నుడవు
కమ్ము. నీ హృదయము శుద్ధము, నిర్మలము
పవిత్ర మైనకొలది నీ వదనముపై ఒక అలౌ
కిక తేజము ఆవిర్భావ మగు చుండును. అప్పు
డు ఎవరి దోషములు చూచుట తటస్థింపదు.
ఇక గొప్ప స్వరముతో ఉపదేశింప వలసిన
అవసర ముండదు. ప్రజలు నీ పరిచయము కలిగి

సంతతే తమ దోషములను గ్రహించు కొని మెదలక వాటిని సంస్కరించు కొను విధానమందే నిమగ్నులగుదురు.

*    *    *

మృత్యుభయమే హిందువుల కన్ని భయముల కంటె గొప్ప భయముగా ఉన్నది. ఈ భయమే వారిని మహమ్మదీయుల వలన భయపడునటుల చేయుచున్నది. మనము ధర్మము నైనను పోగొట్టు కొందుము. కాని లుబ్ధుల వలె ప్రాణములను దాచియుంచు కొనుట ఎఱింగి యున్నారము.

*    *    *

మహమ్మదీయుల మూర్ఖత్వము, బలము కాదు. అది వారియొక్క దుర్బలత్వమే. హిందువులు వారినే అనుసరించినచో మహమ్మదీయుల కంటెను గూడ మిక్కిలి నికృష్టులగుదురు.

*    *    *

నేను పక్కా ధార్మికుడ నైనచో, ధర్మనిష్ఠయే ఉత్తమ వస్తువని నేను నమ్మినచో,

స్వగతము.

నే నితర ధర్మ నిష్ఠ పరులను ఆదరింప వలసినదే యుండు నని విశ్వసించు చున్నాను.

*　　*　　*

నా శిఖను గూర్చి అభిమాన పడుట చెడుగు కానిచో మహామ్మదీయులు తమ గడ్డమును గూర్చి గర్వించుట చెడ్డ దేల యగును?

*　　*　　*

మహామ్మదీయులు ప్రపంచ మంతటను వ్యాపింప గోరుచున్నచో హైందవ సామ్రాజ్యమును స్థాపింప నభిలషించు వారు వారికి చెడ్డ వారుగా నేల దోచవలెను?

*　　*　　*

మహామ్మదీయు లందఱు నశించి హిందువు లైనచో గాని లేక హిందువు లందఱు నశించి మహామ్మదీయు లైనచో గాని హిందూ మహామ్మదీయ సఖ్యత కలుగునా యేమి? నా యభిప్రాయమందు హిందూ మహామ్మదీయ సఖ్యత అనఁగా ఒక ప్రక్క హిందువుఁడును ఒక ప్రక్క మహామ్మదీయుఁడును తమ తమ మతము

లందు దృఢ విశ్వాసము గలవారలై యుండియు పరస్పర మైత్రితో మెలంగుటయే.

* * *

హిందువులు ఉపవాసములు చేయు చుండు అమాయకులగు మహమ్మదీయులను హిందువులుగ జేసిన హిందూ మతోద్ధరణ మగునా. ఏమి? మహమ్మదీయులు అమాయకురాండ్రగు హిందూ అనాథ స్త్రీలను, బాల వితంతువులను మోసగించి మహమ్మదీయులుగ జేసినచో ఇస్లాము నౌక ఒడ్డు చేరునా ఏమి?

* * *

నా యొక్క మందమతిలో ఈ విధముగ మతాంతరము గావించు వారలు ఇతర సంఘము యొక్క మలినమైన, పతితమైన, దూషితమైన, అంశములను తమ సంఘములో ప్రవేశ పెట్టు చున్నారనియే!

* * *

ఎవండు తన వలన ప్రజలు లాభము పొందు చున్నారని తలంచు చున్నాండో వాండు దుర్బలుండు. ఎవండు లాభము పొందుచున్న వాస

స్వగతము.

అపాత్రితను గ్రహించియు ఆ లాభమును పొందనిచ్చు చున్నాఁడో వాఁడే వీరుఁడు.

*　　　*　　　*

వీర పురుషుండు దుర్మార్గుని యందు మంచిని చూచు చున్నాఁడు. ఆ మంచితన మందే ఆతనికి సహాయ పడు చున్నాఁడు. అట్టి సహాయత అసావధానము అజాగ్రత్త కాదు. అవి ఆత్మ బలమును, ఆత్మ విశ్వాసము యొక్క మహిమను సూచించు చున్నది.

*　　　*　　　*

గంగ అపవిత్రులను పవిత్రుల గావించును కనుకనే మహిమ గలదై యున్నది. ఎవఁడు పతితులను, చెడుగులో మునిగి యున్న వారిని తిరస్కరింపకయే వారి చెడుగును పోగొట్టు టకై ఉదారతను జూపించు చున్నాఁడో వాఁడు గంగకన్న తక్కువ మహిమ గలవాఁడు కాదు.

*　　　*　　　*

నేను నా ఆరాధ్య దైవము యొక్క, నా గురువు యొక్క, నా తలి దండ్రుల యొక్క

స్వగతము.

మిక్కిలి తీవ్రమైన ఆలోచనలను స్థిర శాంత స్వభావముతో వినజాలని యెడల నేను సార్వజనిక కార్యములను చేయుటకు యోగ్యుడను కాను.

* * *

ఆరాధ్య దైవము, గురువు, తల్లి దండ్రుల యొక్క ఆలోచన వినుట సులభమే; తన యొక్కయు తన పత్ని యొక్కయు ఆలోచనను గాని లేక నిందను గాని విని దాని వలన నీతిని-శిక్షను గ్రహించు పురుషులు తప్పక తమ్ము తా ముద్ధరించుకొను చున్నారు.

* * *

సహిష్ణుత యొక్క రెండవ పేరే శాంతిమయ ప్రతీకారము. సహిష్ణుత బలాత్కారమయిన నిరోధక శక్తియై యున్నది. ఎవరు తమ సహన శక్తిని వృద్ధి పొందించుకొని యున్నారో అట్టి వారలకే దాని ప్రత్యక్షానుభవము కలుగు చున్నది.

* * *

నన్ను తిట్టువాడు నాతో పాటు నా ప్రతిస్పర్ధిని సహితము తిట్టనిచో అందుకుగాను నే

స్వగతము.

నతనిని నిందించుట నా హీన వృత్తిని సూచించుట లేదా? ఇతరులకు తిట్లు తగులు నప్పుడు సంతోషించుట సజ్జనోచితమా?

* * *

ఒక మిత్రుఁడు తఱచుగా అడుగుచున్నాఁడు- ఏమండీ? అయ్యా! నే నీ పని చేయుచున్నాను. ప్రజలు నేను గొప్పవాడ నగు చున్నా నని అనరుగదా? నే నిట్లు సమాధాన మొసంగు చుందును-నీ మనస్సును పరిశీలించి చూచుకొమ్ము. గొప్పవాఁడను కావలెనను భావము నీలో ఏ కొంచె మున్నప్పటికిని నీ వా కార్యము చేయకుము. అది సేవా భావముతో (పదుగు-పేకవలె) ఓత ప్రోతమై యున్న చో నిస్సంశయుఁడవై అంగీకృత కార్య సిద్ధికై సుస్థిరుండవు కమ్ము.

* * *

సేవా మార్గము వేఱు. పొట్ట నింపుకొను మార్గము వేఱు. ఎవఁడు సేవా రహస్యమును గ్రహించి యున్నాఁడో వానికి పొట్ట నింపుకొనుటకై చింతింప నవసరమే కలుగట లేదు.

 * * *

మనుష్యునకు తన మహత్తు యొక్క జ్ఞానము, బుద్ధి ఉన్నంత వరకు అతఁడు ధార్మిక-ఆధ్యాత్మిక జ్ఞానము నుండి క్రోసుల దూరమందున్నట్లు భావింప వలయును. కాని అట్టి వాని కెప్పుడు తన అల్పత్వము యొక్క జ్ఞానము-స్మృతి కలుగు చున్నదో అప్పుడే వాని ప్రవృత్తి ఆధ్యాత్మిక మార్గమందున్నట్లు గ్రహింప వలయును.

* * *

ఎంత వరకు మన ధ్యానము మన గుణములపై నుండునో అంత వరకు మన అహంకారము మనకు సాహస రూపముగ కానుపించుచుండును. కాని ఎప్పుడు మనకు మన దోషముల యొక్కయు, పాపముల యొక్కయు, పరిజ్ఞానము కలుగ నారంభించునో అప్పుడే నమ్రతానుభవమును పొందు చున్నారము. అప్పుడే మన కది దైవీ సాహస తేజములను ప్రసాదించు చున్నది. * * *

ఏ మనుష్యుఁడు దుర్గాగుని దుర్గాగత్వమును ప్రతిఘటించుటలో తన సర్వస్వమును పోగొట్టు

స్వగతము.

కొను చున్నాఁడో వాఁడే తనకు ప్రియమైన ఇష్టమైన అత్యాచారమునకు స్వాగత మిచ్చు చున్నాఁడు. ఎట్టి ఆశ్చర్యము?

* * *

ఆదర్శవాది పిచ్చివాడు ఏల యనగా వాఁడు కష్టములను సహించి తాను నాశనము పొంది యైనను ఆదర్శమును చేరుటకై లాలసుఁ డగు చున్నాఁడు. వ్యావహారికుఁడు-లౌకికుఁడు తెలివి గలవాఁడు. ఏల యన కష్ట సమయము వచ్చి నప్పుడే తోఁక ముడుచుకొను చున్నాఁడు. అట్టి వాఁడు రాజనీతిజ్ఞుఁడై యున్నాఁడు!!

* * *

వ్యావహారిక వాది-లౌకికుఁడు సఫలుఁడు. ఎందు కనగా దేని నే విధముగ ఫలితమును పొంద నగునో వా డా విధముగనే చేయు చున్నాడు. ఆదర్శవాది అసఫలుఁడు. ఎందు కనగా వాఁడు సన్మార్గము వలననే సఫలతను కోరు చున్నాడు. అసఫలత కలుగు చున్నను దాని నభిమానించు చున్నాఁడు. ఒకప్పుడు సఫలత పొందిన పురుషుఁడు దుఃఖించుటయు, అసఫలుఁ

డయిన ఆదర్శవాది ఆతని కన్నీరు తుడిచి సేవ చేయ వలసిన గతి పట్టుటయు సంప్రాప్త మగుచున్నది.

* * *

పొట్ట సమస్య కంటె మానవత్వ సమస్యయే చాల ఉత్తమ మయినది. కాని పొట్ట కొఱకు మన మెంత ప్రయత్నము చేయు చున్నారమో అంత పాపము సలుపు చున్నారము. ఎవరు మానవత్వమునకై కొంచెముగ నైన ప్రయత్నము చెయు చున్నారో వారికి నా సవినయ ప్రణామము!

* * *

ఆత్మ విశ్వాసము తక్కువగుటయే మానవత్వమునకు న్యూనత. ఏ యాత్మ విశ్వాస మందు తన దుర్బలతను, తప్పులను తెలిసి కొను జ్ఞానము, బుద్ధియు నుండవో ఆ యాత్మ విశ్వాసము మోసము. ఇక నది మానవుని ఉన్మత్తుని చేయు చున్నది.

* * *

స్వగతము.

నేను పవిత్రుడనని, బలవంతుడ నని మనస్సులో తలంచుట ఒక విషయము. సమయము వచ్చినప్పుడు జీవితములో, ఆచరణలో వాటిని పరిచయము గావించుట మఱొక విషయము. వికట విషమ పరిస్థితులలో తన పవిత్రతను, దృఢత్వమును స్థిరముగ సంరక్షించుకొనువాడే నిజమైన వీరుడు.

* * *

ఇది ఎట్టి విచిత్రమైన, విరుద్ధమైన, వికృతమైన విషయము! నిజమైన సత్పురుషునకు వాని సత్య సంధత, సౌశీల్యతల కొఱకై అనేక కష్టములు అనుభవింప వలసి వచ్చు చున్నది. ఘోర యాతనానుభవమునకు పిమ్మటనే మానవ సంఘము వాని సత్య సంధతను గుర్తించి విశ్వసించు చున్నది.

* * *

ఏ సత్య సంరక్షణ కొఱకు మన మితరులను భయపెట్టుట సంభవించు చున్నదో, ఇతరులకు అన్యాయము, అక్రమములు చేయ వలసి వచ్చునో, ఆ సత్య సంధతలో నాకు పూర్తిగా సందేహము కలుగు చున్నది.



* * *

పేరు ప్రతిష్ఠలను కోరువారు నిజమైన ప్రేమతో సేవ చేయుటయే. పేరు ప్రతిష్ఠలు పొందుటకు అమోఘమైన గ్యారంటీ అను ఈ స్వల్ప విషయము వారి బుద్ధి కేల తట్టుట లేదు? యదార్థమైన కార్య పరాయణుఁడు పేరు పదవులు తన కార్యములకు బాధకము లుగ తలంచు చున్నాఁడు. మఱియు ఆ యిచ్ఛా రూపమగు విషమును తొలగించుటకు ప్రయత్నించు చున్నాఁడు.

* * *

ఎవరు ధనము, గౌరవములకై ఉన్మత్తులై పోవు చుందురో వారి నుండి ధన గౌరవ ములు దూరముగా పారిపోవు చున్నవి. కాని ఎవరు హృదయ పూర్వకముగ ఈ కోరికను విసర్జించు చున్నారో అవి వారి వెన్నంటియే పడి యుండును. ఇది ఐంద్రజాలమా ఏమి? మన కార్య కర్తలైన దేశ భక్తులు ఈ రహ స్యము గుర్తింతురా?

* * *

స్వగతము.

ఎంత వరకు మనలను మనము పవిత్రుల మని బలవంతుల మని తలంచు చుందుమో అంత వరకును మనము గనియం దున్న రత్నముల వంటి వారమే! కాని ప్రజ లెప్పుడు మనలను పవిత్రులు, బలవంతు లని తలంచెదరో అప్పుడే మనము ప్రపంచమునకు వినియోగ పడు రత్నముల వంటి వారము

*　　　*　　　*

పర్వత గుహ లందే దాగి యుండి వాడి పోవునట్టి గులాబీ పుష్పము ఆత్మ బలిదాన మొనరించిన వీరుల వీర పథమందు వెదజల్లబడిన బంతి పువ్వు వోలె కృతార్థత నంద గల్గునా?

*　　　*　　　*

తుమ్మ చెటు తన ముండ్ల తనమును గూర్చి గర్వించును గాక! లేక ఉపేక్షించును గాక! దీనిలో దాని కెట్టి హితమును లేదు గదా? కాని ప్రపంచము దాని ఉపయోగమును చక్కగా గ్రహించును గాక!

౧౦౦　　　*　　　*　　　*

———



| మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA127B175 |
| పుస్తకం పేరు | స్వగతము (ఆత్మపరీక్ష) |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 109 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | IV |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Bannu |
| స్కాన్ చేసినది | Prathyusha |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |